శ్లో॥ వసుదేవ సుతం దేవం
కంస చాణూర మర్దనమ్ ।
దేవకీ పరమానందం
కృష్ణం వందే జగద్గురుమ్ ॥

వసుదేవుని పుత్రుడును, కంస చాణూరులను మర్దన (దండన) చేసిన వాడును, దేవకీదేవికి పరమానందము నొసంగువాడును, దివ్యగుణ యుక్తుడును, జగద్గురువును నగు యుగపురుషుడైన శ్రీకృష్ణునకు వందనములు.

ప్రియ పాఠకులారా !

ఈ "శ్రీకృష్ణుని చరిత్ర" చదివిన మీకు శ్రీకృష్ణుడు యెంతటి గొప్పవాడో కొంత విశదమై యుండవచ్చును. ఇది చదివినందువలన కలిగిన ఆనందము వలన నేడు లోకములో శ్రీకృష్ణుని గూర్చి వ్యాపకములోనున్న కథలు, నాటకములు, నాటికలు, నవలలు, గేయములు మరియు పాటలు మొదలగు వానిపట్ల జుగుప్స కలుగుటలేదా? అట్టి వానిని ఖండించుట మన ధర్మము కాదా? మన పిల్లలకు శ్రీకృష్ణుని యథార్థ జీవితము వివరింపవలసిన అవసరము లేదా? ఆలోచింపుడు.

మహాపురుషుల జీవిత చరిత్రలను కలుషితము జేయుచున్న రచనలను, రచయితలను ప్రోత్సహించుచున్న పత్రికలను ఎదుర్కొని సాహితీ కాలుష్యమును తొలగించుటకు మనమంతా కలిసి కృషి చేద్దాము రండి.

- ప్రకాశకులు

ఓ3మ్

# యుగపురుషుడు శ్రీకృష్ణుడు



సంధ్యావందనం శ్రీనివాసరావు

ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమము**

వ్యాస్ వైదిక సేవా సమాజము

వ్యాస్‌నగర్ - సీతాఫలమండి, సికింద్రాబాద్

తృతీయ ముద్రణ ప్రతులు :2000

ఈశ్వర శ్రావణ పూర్ణిమ
(18 ఆగష్టు 1997)

మూల్యము : రూ. 8-00
(పోస్ట్ ఖర్చులు అదనం)

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, వ్యాస్ నగర్, సికింద్రాబాద్ - 61

2) స్వస్తిక్ మెటల్ ప్రొడక్ట్స్, 3-3-738, కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.

3) వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001.

4) ఆర్. కృష్ణమూర్తి బుక్ సెల్లర్స్, ఆర్యసమాజ మందిరము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61.

PRINTED AT ✆ 812904
PRINTSHOP
D.T.P. - OFFSET - SCREEN
SECUNDERABAD - 500 003

## కృతజ్ఞతలు

ఆర్ష సాహిత్య ప్రచార ట్రస్టు ఢిల్లీ వారిచే నడుపబడుచున్న 'దయానంద్ సందేశ్ ' హిందీ మాసపత్రిక - 1985 సం॥ర విశేషాంకములో ప్రచురింపబడిన 'యోగేశ్వర శ్రీకృష్ణ' అను వ్యాస సంపుటి ఒక అద్భుత పావన చరిత్ర సమీకరణ. ఈ సంచికలో అనేకమంది ఆర్య విద్వాంసులచే రచింపబడిన వ్యాసములు సంకలనమొనర్చి ప్రచురింపబడినవి. వీనిలో చాలా భాగమును తెలుగు భాషలోని కనువదించి 'యుగపురుషుడు శ్రీకృష్ణుడ'ను పేర ఈ పుస్తకమును ముద్రించుట జరిగినది. ఇందులో సేకరించిన వ్యాసములు, ఆ వ్యాసకర్తల పేర్లు వరుసగా -

1. వాస్తవమైన కృష్ణుడు మహాభారతములోని వాడా?
   లేక పురాణములలోని వాడా ?
   (శ్రీ యశ్‌పాల్ ఆర్యబంధు-మురాదాబాద్)
2. శ్రీకృష్ణుని చరిత్ర (శ్రీ జగదీశ్ ఆర్య - బీహర్)
3. ఆర్యవర శిరోమణి (శ్రీ ఆచార్య వేదవ్రత్ మీమాంసక్ -
   ఆర్ష గురుకులము - వడ్లూరు - కామారెడ్డి)
4. ఆదర్శ మిత్రుడు (శ్రీపండిత రాజవీర్ శాస్త్రి)
5. ఆదర్శ మిత్రత్వము (శ్రీ ఆచార్య సత్యవ్రత్
   రాజేశ్-కాంగడీ గురుకులము-హరిద్వార్ విశ్వవిద్యాలయము)
6. శాంతి ప్రియుడు (శ్రీ ఆచార్య ఉదయవీర్ శాస్త్రి -
   గాజియాబాద్) (శ్రీ పం. రాజవీర్ శాస్త్రి)
7. మహాతేజో సంపన్నుడు ( శ్రీ ఆచార్య చంద్రదేవ్ శాస్త్రి -
   మహర్షి దయానంద గురుకులము - కృష్ణపుర, ఫరూఖాబాదు)
8. కర్మయోగి (శ్రీ అర్జున దేవ్ స్నాతక్ - ఆగ్రా)
   (యోగిరాజు -శ్రీ కాశీనాథ శాస్త్రి - గోందియా మహారాష్ట్ర)

9. యుద్ధనీతి ( శ్రీ పండిత రాజవీర్ శాస్త్రి)

10. ఆర్య ఆదర్శములకు ప్రతీక
( శ్రీ డాక్టర్ భవానీలాల్ భారతీయ-పంజాబ్ విశ్వవిద్యాలయ,
దయానంద పీఠాధ్యక్షులు - చండీఘడ్)

11. శ్రీకృష్ణుని అవసరము నేడున్నది
(శ్రీ ప్రహ్లాద్ రాయ్ పచేరియా - బొంబాయి)

12. శ్రీకృష్ణుని జన్మదిన మెందుకు జరుపుకొందుము ?
(శ్రీ స్వామి విద్యానంద సరస్వతి - ఢిల్లీ)
( శ్రీ రాజేంద్ర జిజ్ఞాసు - అధ్యాపకులు - వేదసదన్ - అబోహర్)

వీరందరకూ మా కృతజ్ఞతాపూర్వక అభివందనములు తెలియజేయుచున్నాము.

ఈ పుస్తకమునందలి ఉపోద్ఘాతము డాక్టర్ భవానీలాల్ భారతీయ గారి 'శ్రీకృష్ణ చరిత్' యను పరిశోధనా గ్రంథమునుండి సంగ్రహింపబడినది. వీరు చండీఘడ్‌లోని పంజాబు విశ్వవిద్యాలయము నందున్న శ్రీ దయానంద పరిశోధనా పీఠమునకు అధ్యక్షులు. వీరికి మా కృతజ్ఞతా పూర్వక వందనములు. అట్లే 'ఆర్షసాహిత్య ప్రచార ట్రస్టు - ఢిల్లీ - గౌరవ సంపాదకులైన శ్రీ పండిత రాజవీర్ శాస్త్రి గార్కి మా కృతజ్ఞతాభివందనములు

శ్రీ విభవ పుష్యమీ
26 - 1 - 1989

ఇట్లు
సంధ్యావందనం శ్రీనివాసరావు
(గాయత్రీ ఆశ్రమ ట్రస్టు)

# ప్రకాశకీయము

" యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనాః । "

ఉత్తములు దేని నాచరింతురో సామాన్య జనులందరు దానినే అనుసరింతురు. ఇది భగవద్గీతలోని శ్రీకృష్ణుని వచనము. స్వార్థ ప్రయోజనం కోసం ధర్మానికి విపరీతార్థాలు చేసి ద్వాపర యుగాంతమున లోకానికి వైదిక ఆదర్శములను చాటుటకు తన జీవితమంతయు అర్పించిన ఆదర్శ యుగపురుషుడు శ్రీకృష్ణుడు. కాని నేడు లోకములో ప్రచారములోనున్న కృష్ణ కథలన్నియు అందుకు విపరీతముగా శ్రీకృష్ణుని ఒక దొంగగా, కపటిగా, వ్యభిచారిగా ఇంద్రియలోలునిగా, యుద్ధ ప్రియునిగా చిత్రించినవి - చిత్రించుచున్నవి. కథల పేరుతో, కావ్యముల పేరుతో, సంగీత, నాట్యముల పేరుతో కృష్ణ చరిత్ర కలుషితమైనది. చివరకు "ఇంట్లో రామయ్య - వీధిలో కృష్ణయ్య" అనుసినిమా పేర్లు పెట్టుటకు కూడా వెనుకాడుట లేదు. ఇవన్నియు విలాస ప్రియులకు ఆదర్శములుగా మారినవి. క్రైస్తవ, మహమ్మదీయ, నాస్తిక మత ప్రచారములకు ఆయుధములుగా తయారయినవి. ఇట్టి పరిస్థితులలో ఈ 20వ శతాబ్దమున కొందరు వివేకవంతులయిన విద్వాంసులు కృష్ణుని యథార్థ చరిత్రను అన్వేషించిరి. వారిలో మహర్షి దయానందుడు అగ్రగణ్యుడు, మరియు ప్రప్రథముడు. వారి రచనల ప్రేరణతోనే బంకించంద్రుడు, బాలగంగాధర్ తిలక్ మరియు పం. భవానీలాల్ భారతీయ, పం. చమూపతి మొదలగు ఆర్య విద్వాంసులు తమ నిశిత తర్కశక్తితో ప్రక్షిప్తములను తొలగించి శ్రీకృష్ణుని యదార్థ చరిత్రను వెలుగులోనికి తెచ్చిరి. వారి రచనలన్నియు హిందీ, ఇంగ్లీషు భాషలలో నున్నవి. వారి భావాలను తెలుగులోనికి అనువదించి ఈ సంకల రచన గావించిన మిత్రులు శ్రీ సంధ్యావందనం శ్రీనివాసరావుగారు ప్రశంసనీయులు. వారి బాల్యము అతి సామాన్యముగనే గడచినను పూర్వజన్మ సుకృత విశేషమున మహర్షిదయానందుల గ్రంథాధ్యయనము, పూజ్యులు పం. గోపదేవ్ శాస్త్రిగారి అంతేవాసిత్వము వారికి లభించినవి. వీటికితోడు తన భావాలకు పూర్ణ అనుకూలవతియైన ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీదేవిగారు లభించుట ఒక గొప్ప పుణ్యఫలము. ఈ పుణ్యదంపతులు తను మనోధనములతో తమను తాము వైదిక ధర్మ ప్రచారమునకు అంకితము చేసికొనిరి. నిద్రాహారములు లెక్కచేయక ధర్మప్రచారములో నిరంతరము శ్రమించుచున్నారు. వారికి పరమేశ్వరుడు దీర్ఘ ఆయురారోగ్యములనిచ్చి సదా కాపాడవలెనని మనసారా ప్రార్థించుచున్నాను.

ఈ పుస్తక తృతీయముద్రణను అత్యంత శ్రద్ధాసక్తులతో చేసి ఇచ్చిన ప్రింట్‌షాపు అధికారులకు, కార్యకర్తలకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

ఈశ్వర శ్రావణ పూర్ణిమ
వ్యాసనగర్

డా. కోడూరి సుబ్బారావు
గాయత్రీ ఆశ్రమం.

# ఉపోద్ఘాతము

## వాస్తవమైన కృష్ణుడు మహాభారతములోనివాడా?
## లేక పురాణములలోని వాడా?

మహాపురుషుల జీవిత చరిత్రలను వికృతపరచి చూపునట్టి అభాగ్య జాతి ఏదైనా ఒకటి ఈ ప్రపంచంలో యున్నచో అది హిందూజాతియే. హిందూజాతిలో గల మహాపురుషుల చరిత్రలలో నత్యధిక వికృతము చేయబడినట్టి చరిత్ర శ్రీకృష్ణ చరిత్రయే! మహాభారతములో నతి ఉజ్జ్వలము, అతిపావనము మరియు సర్వగుణ సంపన్నుడైన మహాపురుషుని రూపములోగల శ్రీకృష్ణుని చరిత్రను పురాణ, భాగవతాది గ్రంథములలో, కావ్యములలో నతివికృత రూపమున అభాగ్య హిందూజాతికి చెందిన భక్తులు చూపిరి. తత్పరిణామముగ యిప్పుడు మహాభారతములోని శ్రీకృష్ణుని చరిత్ర ఊహింపనంతటి అసహ్యారూపమును దాల్చి ప్రచారములో నున్నది. దాని ఫలితముగ నేడు ప్రజలకు శ్రీకృష్ణునిపైగల అభిప్రాయమును బంకించంద్ర చటర్జీ యిట్లు వ్రాసిరి. -

"శ్రీకృష్ణుడు బాల్యమున దొంగ, పాలు, పెరుగు, వెన్న దొంగిలించి తినుచుండెడి వాడు. యువావస్థలో వ్యభిచారి. అనేకమంది గోపికాస్త్రీల పాతివ్రత్యమును నష్టమొనర్చెను. ప్రౌఢావస్థలో వంచకుడు మరియు మోసగాడు. మోసగించి ద్రోణాదుల ప్రాణములను తీసెను." "ఇదేనా భాగవత చరిత్ర?" అని చివరకాయన ప్రశ్నించును. (కృష్ణ చరిత్ర 2 వ పేజీ)

మహాపురుషుల వాస్తవిక స్వరూపములను తెలుపక వారిని అలౌకిక రూపములో చూపుటకు యత్నించుట, యథార్థ చరిత్ర యనబడదు.
డాక్టర్ భవానీలాల్ భారతీయగారి శబ్దములలో :

శ్రీకృష్ణుని లౌకిక జీవనమునుండి వేరుచేసి అలౌకిక గుణములను ఆపాందించుట, ఆయన యొక్క సహజ గౌరవ రూపమును మరచి అసహజ మరియు దైవిక గుణముల నాపాదించుట, యిదియే కృష్ణ చరిత్రలోని ప్రథమ వికృతి. కృష్ణుని ఈశ్వర అవతారముగ చేసి ఆయన నుపాసించుట ప్రారంభించినప్పటి నుండి ఈ దేశములో కృష్ణోపాసన ఆధారముగ ననేక సంప్రదాయములు స్థాపింపబడినవి. (శ్రీకృష్ణ చరిత్ర 10వ పేజీ) ఈ సంప్రదాయములు పుటుట్టకు పూర్వము కృష్ణుని ఆదర్శ చరిత్రునిగ, పరమసాత్విక ఆచారములతో కూడిన వాడు మరియు ప్రతిభాశాలియైన మహాపురుషునిగ నెంచుచుండెడి వారు. కాని తాంత్రిక

సాధనల ప్రచారము మూలముగ వైష్ణవ సంప్రదాయములలో కూడా శృంగార లీలలకు సంబంధించిన వాసనలు మిశ్రమము కాసాగినవి. మహాభారతములోని శ్రీకృష్ణుడుమర్యాద పోషకుడుగను, సత్యగుణ సంయమి సంపన్నుడుగ నుండగ పురాణములు, కావ్య గ్రంథములు మరియు సాంప్రదాయిక గ్రంథములలో ఆయన జీవనమత్యంత విలాసపూర్ణముగను, స్థూలవాసనాయుక్తము మరియు (రొమాంటిక్) ఆశ్చర్యకరముగను చిత్రించుటకు ప్రయత్నము జరిగినది. భాగవత, బ్రహ్మవైవర్తాది పురాణములలోను, జయదేవుని గీతగోవిందము వంటి కావ్యములలోను మరియు గోపాల సహస్ర నామముల వంటి స్తోత్రములలోను సర్వత్ర శ్రీకృష్ణుని వ్యభిచారిగ చిత్రింపబడినది. "గోపాలః కామినీజారః చౌరజార శిఖామణిః" వంటి మాటలు పైగ్రంథము లోనివి. భాగవతములో పరదార గమనమును గూర్చి స్పష్టముగా వ్రాసి యుండుటచే పరీక్షిత్తు రాజునకు కృష్ణుని చరిత్ర విషయములో సందేహము కలుగును. కాని శుక మహర్షి సామర్థ్యముగల వ్యక్తియగుట వలన ఎట్లో సమాధానపరచి తన కర్తవ్యము ముగిసినట్లెంచెను.

బ్రహ్మవైవర్త పురాణములో రాధను సృష్టించుట ద్వారా ఈవికృతము నధికము చేసెను. దానిలో రాధాకృష్ణుల సంభోగమును గూర్చి చేసిన కుత్సిత వర్ణనను జూచిన లజ్జకు కూడా లజ్జకలుగును. (శ్రీకృష్ణ చరిత్ర 10,11 పేజీలు) ఆశ్చర్య దుఃఖములను కలిగించు విషయమేమనగా - ధర్మ గ్రంథములుగా చెప్పబడు పుస్తకముల స్థితి యిట్లున్నచో యితర గ్రంథముల స్థితి యెట్లుండవలయును? వాస్తవముగా భాగవతాది పురాణములలో శ్రీకృష్ణుని నిర్దోష వ్యక్తిత్వముపై చేసిన మిథ్యారోపణలు ఆ గ్రంథకారుల కుత్సిత భావములను తెలుపుచున్నవి. ఉజ్జ్వల పావన చరిత్రగల శ్రీకృష్ణునిపై ఏవిధమైన ఆరోపణలు చేయుటకు వీలుండదు. ఆధునిక యుగములో మహర్షి దయానందుడు ప్రప్రథమముగ " శ్రీకృష్ణుని చరిత్ర మహాభారతములో నత్యుత్తమముగ నున్నదని " ఉచ్ఛస్వరముతో ఘోషించిరి.

ఈ విషయమున సుప్రసిద్ధ పండితులు చమూపతి గారిట్లు వ్రాసిరి :

"మహాభారతములో గోపికల ప్రేమలీలలకు సంబంధించిన వాసన కూడ లేదు. రాసలీలలకు సంబంధించిన వర్ణనలు ఏ ప్రసంగముననులేవు. మహాభారతములోని కృష్ణుడు చక్రధారి, గదాధారి, ఖడ్గధారి,మురళీధరుడు కాదు (యోగేశ్వర కృష్ణ 26, 27 పేజీలు). మహాభారతమున కృష్ణుడు ఏకపత్నీ వ్రతుడు.

పురాణములలో ఆయనకు 16 వేల గోపికల నంటకట్టిరి. మహాభారతమునందలి కృష్ణుడు అత్యంత సంయమి. పురాణములలో శ్రీకృష్ణుడు . . . . . . ? (కృష్ణుని గూర్చి యట్టి శబ్దములను ప్రయోగించుటకు హృదయము కంపించును.) ఆశ్చర్యమేమన: ఒక్క పుత్రుని పొందుటకు 12 సం॥రం॥లు ఘోర తపమొనర్చినట్టి శ్రీకృష్ణుని వంటి మహాత్ముని పురాణకారులు కుబ్జాదులతో వ్యభిచరించినట్లు చూపిరి. అటువంటప్పుడు వాస్తవమైన కృష్ణుడు మహాభారతములోని వాడా? పురాణములలోని వాడా? యనునది విజ్ఞులైన పాఠకులు స్వయముగానే ఆలోచించగలరు. సంపూర్ణ మహాభారతము శ్రీకృష్ణుని యొక్క గౌరవ గాథయే. దానిలో నుండాయనను తీసివేసినచో మహాభారతములో నేమి మిగిలియుండును? మహాభారతమున శ్రీకృష్ణుని పూజ్యతమ, శ్రేష్ఠతమ మరియు మహామానవుని రూపమున వర్ణించెను.

అట్టి ఉత్తముని గూర్చి బంకింబాబు యిట్లు వ్రాసిరి. "యథార్థముగ శ్రీకృష్ణునివంటి సర్వగుణాన్వితుడు, సర్వపాపరహితుడు, ఆదర్శ చరిత్రుడు ఏ దేశ చరిత్రలో గాని, ఏ కావ్యములో గాని మరెచ్చటను లేడు.' మహాభారతము నధ్యయనము చేసిన కృష్ణుని చరిత్రలో ఆర్యజీవనము యొక్క సర్వతోముఖ వికాసము కనబడుచుండును. ఆయన జీవితములో సాఫల్యము నొందని కార్యమేదియును మనకు కానరాదు. ఆయనొక ఆదర్శ విద్యార్థి, ఆదర్శ గృహస్థుడు. ఆదర్శ మిత్రుడు, ఆదర్శ కర్మయోగి. మహాభారతములోని శ్రీకృష్ణునిలో లేని సద్గుణమే లేదు. దీనికి విపరీతముగ పురాణములలోని కృష్ణుని మహాపురుషుని మాటటుంచి సాధారణ వ్యక్తిగ కూడ చెప్పుటకు వీలులేదు. సాధారణముగ తమ పూర్వులలో నేదైనా అవగుణముగాని, దోషముగాని యున్నచో వారి యనుయాయులు వారి మంచి గుణములనే స్తుతించుచుందురు. గాని దోషములను చెప్పరు. కానీ తమ మహాపురుషులలో నే దోషము లేనప్పటికిని వారిపై నానా మిథ్యారోపణలు చేయు ఈ హిందూజాతి నేమనవలయును?! పరమపిత పరమాత్మ ఈ జాతికెన్నడు సద్బుద్ధి నిచ్చునో తెలియదు. నేడు భారతదేశమునకు మురళీధరకృష్ణుడు కాక చక్రధారియైన కృష్ణుడు కావలయును.

**అవతార వాదము :**

మహాభారతములో శ్రీకృష్ణుడొక ఆదర్శ పురుషుడుగ చిత్రింపబడెను. కాలము గడచినకొలది భారతదేశమున ఈశ్వరుని అవతారములు కల్పించినప్పటి నుండి వాసుదేవ కృష్ణునికూడ విష్ణువుయొక్క అవతారముగ షోడశ కళలతో కూడిన

భగవానునిగ 'ఏతేచాంశ కలాపుంసః కృష్ణస్తు భగవాన్ స్వయం' అని చెప్పసాగిరి. కాని అత్యంతాశ్చర్యకరమైన విషయమేమన - విష్ణువుయొక్క అవతారముగ చెప్పిన కృష్ణునే ఆయన భక్తులు చోరుడు, వ్యభిచారి, వంచకునిగ పురాణములలో వర్ణించుటకు సంకోచింపలేదు.!

శ్లో ॥ అహం హితత్ కరిష్యామి పరం పురుషకారితః ।
దైవం తు న మయాశక్యం కర్మకర్తుం కథంచన ॥ (మహా. ఉద్యోగ. 79 - 5)

'నేను మానవులకు సాధ్యమైన ప్రయత్నము చేయుదును. కాని దైవ నిర్ణయ మేమాత్రము నావశమందు లేదు'. అను శ్రీకృష్ణునొక మానవునిగ తెలుపు నిట్టి ఉదాహరణలతో కూడిన శ్లోకములెన్నో మహాభారతమున గలవు. శ్రీరాముడు, శ్రీకృష్ణులవంటి ఆదర్శ మహాపురుషులను భగవానుని అవతారముగ తలంచుటవలన నేర్పడిన పరిణామమేమన: ప్రజలు వారి విగ్రహములను స్థాపించి వానికి షోడశోపచారములతో పూజలు, అర్చనలు చేయుచు వారి లీలలను గానము చేయుచున్నారేగాని, వారిలోని మానవులాచరింపదగు గుణములను గ్రహించి తమ జీవితముల నుద్ధరించుకొనుట కెవరును ప్రయత్నించుట లేదు.

అవతారవాదము పూర్తిగా అవైదికము. భారతదేశములో అవతార వాదము జైన బౌద్ధమతముల వారినుండి సంక్రమించినది. పౌరాణిక బ్రాహ్మణులు వారి ననుకరించుచు అవతారములకు సంబంధించిన కల్పిత కథలతో పురాణముల పేర గ్రంథములను రచించిరి. ఇవి చాలా నవీనములు.

శ్రీకృష్ణ చరిత్రలోని త్రివిధ వికారములకు సంప్రదాయ గ్రంథ రచయితలు, పురాణకర్తలు, కామవాసనలతో కూడిన భావనలను లజ్జారహితముగా చిత్రించు కవులు కారకులని నిస్సందేహముగా చెప్పవచ్చును. దార్శనికులు, ధర్మశాస్త్రకారులు, సంప్రదాయములను పాటించు ఆచార్యులే కృష్ణుని వాస్తవ చరిత్రను వికృతమొనర్చిన యింక సాధారణ జనులను దూషించి ప్రయోజనమేమి? శ్రీకృష్ణ చరిత్రలో వర్ణింపబడిన శృంగార లీలలకు స్థూల అర్థములను గ్రహింపరాదని, ఆ గాథలకు అలంకారిక వ్యాఖ్యలను గ్రహింపవలయునని భాగవత, బ్రహ్మవైవర్తాది పురాణకర్తలు అభిప్రాయమును వ్యక్తము చేయుచుందురు. గోపిక - కృష్ణుల కామక్రీడలు ఆత్మ-పరమాత్మల సామీప్యతను తెలుపునవిగను, అట్లే రాధాకృష్ణుల ప్రేమగాథలు ప్రకృతి పురుషుల క్రీడలకు చిహ్నముగ చెప్పుచుందురు. వారిని సంతోషపరచుటకై తాత్కాలికముగ వారి మాటల నంగీకరించినను విమతస్థుల ఆక్షేపణలకు

సమాధానమివ్వజాలము. కోట్లాది నిరక్షరాస్యులు, అల్పవిద్య గలవారు వీరి మాటలను నమ్మజాలరు. కనుక శ్రీకృష్ణుని పవిత్ర చరిత్రపై వీరు వేసిన కళంకమును, మిథ్యారోపణలను స్పష్టముగ నిరాకరించుట జరుగనంతవరకు ఆయన మహోదాత్త స్వరూపమును సామాన్యజనుల ముందుంచజాలము. అట్లే శ్రీకృష్ణునిచరిత్రపై దుష్ప్రచారముతో విషమును వెదజల్లుచున్నట్టి క్రైస్తవమత ప్రచారకుల నాపజాలము. వీరు పురాణ కావ్యముల ఆధారముగ శ్రీకృష్ణుని వికృత చరిత్రను, హిందువుల దేవతలను అసభ్యకరముగ చిత్రించుచుండగ తాము హిందువులమని చెప్పుకొనువారు కళ్ళప్పగించి చూచుచున్నారు. లక్షల సంఖ్యలో ప్రచురించిన ఈ వికృత అశ్లీల సాహిత్యమును క్రైస్తవుల పండుగలలో, ఉత్సవములలో ఉచితముగ పంచుచున్నారు. సాధారణజనులీ సాహిత్యమును చదివి ప్రభావితులై త్వరితగతిని మత మార్పిడులకు లోనగుచున్నారు. అట్లే కృష్ణ చరిత్రను గూర్చి సమాలోచన జరుపునపుడు దానివలన కలుగు దుష్పరిణామములలో మరొక ముఖ్యమైనదేమన - ప్రపంచములో కొందరు ధూర్తులు, లంపటులు, వ్యభిచారులు తామొనర్చు దుష్ట కార్యములను దాచుటకుగాని, లేక వానిని సమర్థించుటకుగాని సిగ్గువిడిచి కృష్ణుని ఉదాహరణగ చెప్పుచుందురు. ధర్మమనెడు ముసుగులో యిట్టి వంచనతో కూడిన కార్యములు జరుపబడుచుండును. వల్లభ సంప్రదాయము ననుసరించు గురువులు తమను తాము కృష్ణునిగ చెప్పుకొనుచు తమ శిష్యుల తను మనోధనములను సమర్పణ చేయించిరి. కలకత్తాలోని గోవింద భవనమునకు చెందిన హీరాలాల్ గోయంకా యనునతడు సదాచార స్త్రీల శీలమును హరించుచుండెను. ఇంకెంతమంది ఈ విధముగ 'రాధా-రమణ' గోపీ-వల్లభు'ల వలె నటించుచున్నారో తెలియదు!

వివేకముతో నాలోచించిన మహాభారతమునందు శ్రీకృష్ణుని లోకాదర్శ సమన్విత చరిత్రగల వానినిగ చిత్రించెనని స్పష్టమగుచున్నది. పురాణ కావ్యములలో నంతటా వికృత సాంప్రదాయిక రూపములో వర్ణింపబడినది. 19 వ శతాబ్దములో జన్మించిన యిరువురు మహాపురుషులు భారత జాతికి కొన్నివేల సం॥రముల తరువాత శ్రీకృష్ణుని వాస్తవచరిత్రను మరల గుర్తుచేసిరి. వారిలో ప్రథముడు స్వామి దయానంద సరస్వతి. వీరు ధార్మిక, సామాజిక, సాంస్కృతిక రంగములలో దేశము నలుమూలలా క్రాంతితో కూడిన ప్రగతిని సాధించుటకు నాందిని పలికిరి. ఆయన తర్కమనెడు ఆయుధముతో ప్రగతిపథ దృష్టితో గొప్ప సహనశీలియైన శ్రీకృష్ణునివంటి మహాపురుషుని చరిత్రలోని దివ్యగుణమును, పవిత్రతను దర్శింపగలిగిరి. సామాన్య

జనులలో వ్యాపించిన పురాణములలో ప్రతిపాదింపబడిన శ్రీకృష్ణుని దూషిత చరిత్రను కూడ ఆయన పరిశీలించిన తరువాత కృష్ణ చరిత్ర పూర్తిగ వికృత రూపమును దాల్చుటకు కారణము భాగవతకారుడని చెప్పుచు - 'ఈ భాగవతకర్త తన యిష్టానుసారముగ అనుచిత దోషారోపణలను చేసెను. పాలు, పెరుగు, వెన్నల దొంగతనము, కుబ్జ దాసీతో సమాగమము, గోపికా స్త్రీలతో రాసలీలలు మున్నగు మిథ్యారోపణలన్నియు ఆయనపై చేసిరి.' అని వ్రాసిరి. దయానందుని ఈ యభిప్రాయమును పాశ్చాత్య, భారతీయ విద్వాంసులంగీకరించిరి. ఈయన సమకాలీకుడైన బంకించంద్ర చట్టర్జీ 1886 సం॥లో శ్రీకృష్ణ చరిత్రపై విపుల తాత్త్వికాలోచన జరిపి స్వామి దయానందుడు సూత్ర రూపమున వివరించిన దానినే అంగీకరించుచు - 'మహాభారతమున వర్ణించిన కృష్ణ చరిత్ర ప్రామాణికము. పురాణముల లోని కృష్ణ చరిత్ర ప్రామాణికము కాదనిరి.' కృష్ణ చరిత్రను వికృత మొనర్చిన వారిపై ఆయన విరుచుకుపడిరి.

**కృష్ణుని గూర్చి చారిత్రిక ఆధారము :**

కొందరు భారతీయ సంస్కృత విద్వాంసులు తమ పాశ్చాత్య గురువుల ననుకరించుచు కృష్ణుని చారిత్రిక సత్యముపై సందేహమును వెలుబుచ్చుచున్నారు. కాని మహాత్మా గాంధీ వంటి జాతీయవాది; యుగపురుషుడు, ఆర్య సంస్కృతికి ప్రతీకయైన కృష్ణుని వంటి మహాపురుషుని జన్మ విషయమున సందేహమును ప్రకటించెను! ఇందుకు కారణము మహాభారతమునకు సంబంధించిన చారిత్రిక ఆధారములను గూర్చి గాని, కృష్ణుని వ్యక్తిత్వముయొక్క వివిధ దశలను గూర్చిగాని గంభీరముగ నాలోచించుట కాయన కెప్పుడూ సమయము చిక్కియుండకపోవచ్చును. దీనితో స్పష్టమగునదేమనగా: మహాభారత యుద్ధములో ప్రముఖపాత్ర వహించిన కృష్ణునిపైన, ఆయన చేసిన గీతోపదేశములపైన గాంధీజీకి నమ్మకములేదు. ఆయన రామకృష్ణాది చారిత్రక పురుషులను, ఆర్య చరిత్రకు ప్రతిష్ఠాకరమైన రామాయణ మహాభారతాది గ్రంథములను కాల్పనికములుగ నెంచి, వాని చారిత్రిక అస్తిత్వమును మహత్తులను అంగీకరింపలేదు. దీని కాయన స్వకల్పిత అహింసా సిద్ధాంతమే కారణము. బౌద్ధ జైన మతస్థులు పాటించు అహింసా సిద్ధాంతమునకంటె ఆయన దృష్టికోణము అధిక పూర్ణమైనదేయైనను ఈ అహింసానీతి వేదములు, ఉపనిషత్తులు గీత, మనుస్మృతి, యోగాది ప్రాచీన ఆర్ష వాఙ్మయములో ప్రతిపాదింపబడిన అహింసా భావనకు పూర్తిగా భిన్నమైనది. వైదిక

ఆదర్శము ననుసరించి ఈషణత్రయములను విడిచి సంన్యసించిన పరివ్రాజకుడు, సర్వప్రాణులకు హితమొనర్చు చింతన, భూతదయ, విశ్వబంధుత్వ భావనను నొక్కిచెప్పుచు పూర్ణ అహింసా భావమును పరిపాలింపవలయును. కాని సామాన్య జనులు, దేశమును పరిపాలించు క్షత్రియులు, బలవంతులైన యితరుల అత్యాచారములనుండి రక్షింపబడుటకు, ప్రజలను రక్షించుటకు అస్త్రశస్త్రములను ధరింపవలయునని ఆదేశింపబడినది. కాని గాంధీజీ పరివ్రాజకులు-యోగులు ఆచరింపవలసిన అహింస (యోగశాస్త్రములో దీనినే సార్వభౌమ మహావ్రతముగ చెప్పబడినది) ను అందరూ పాటింపగా చూడవలయునని తలంచుచుండిరి. ఇది మానవ ప్రకృతి కసంభవముగ గోచరించును. స్వకల్పిత అహింసా సిద్ధాంతమును మహాభారత గీతాదులలో, ప్రాచీన గ్రంథములలో వెదకుటకై వ్యర్థప్రయాస యొనర్చునట్టి మహాత్మా గాంధీజీ మహాభారత యుద్ధమును దేవాసుర శక్తుల ద్వంద్వ రూపకముగ, శ్రీకృష్ణుని జ్ఞానమూర్తికి ప్రతీకగ నెంచెను. కాని చారిత్రిక సత్యములను, మహాభారత యుద్ధమును, శ్రీకృష్ణుని, కల్పిత ఆలంకారిక వర్ణనగ చెప్పజాలము.

మహాభారతముపై సమగ్ర పరిశీలన జరిపిన రాయ్‌బహదుర్ చింతామణి వినాయక్‌వైద్య అను ప్రసిద్ధ రచయిత 'మహాభారత మీమాంస' యను గ్రంథములో పాశ్చాత్య విద్వాంసులు వెబర్, వీలర్, రమేశ్‌చంద్రదత్తుల యొక్క కాల్పనిక ఆలోచనలను ఖండించుచు మహాభారత యుద్ధమును, పాండవ శ్రీకృష్ణుల అస్తిత్వమును ప్రమాణములతో సిద్ధపరచెను. చారిత్రిక విలువలతో కూడిన ఈ గ్రంథము అత్యంత ప్రామాణికము మరియు అందరి కుపయోగకరమైనది.

మహాభారతమేగాక యితర ప్రాచీన సాహిత్యములో కూడ భారత యుద్ధమును గూర్చి ,పాండవులు, శ్రీకృష్ణుల గూర్చి అనేకచోట్ల వారి చారిత్రిక అస్తిత్వమును గూర్చి తెలుపు ఆధారములు లభించును. ఇచ్చట పాణినీయ 'అష్టాధ్యాయీ సూత్ర పాఠము' నందలి కొన్ని సూత్రములతో 'పాణిని కాలమున, మహాభారత కాలమునాటి వ్యక్తులను గూర్చి, వారి పాత్రలను గూర్చి కూడా బాగుగా తెలియునని నిరూపించబడును. వెబర్‌వంటి కొందరు రచయితలు పాణిని మహర్షిని ఆధునికునిగ నిరూపించుటకు యత్నించినను యూరప్‌వాసియైన 'గోల్డ్ స్టకర్' అను ప్రసిద్ధ విద్వాంసుడు పాణిని కాలమును ప్రాచీనమైనదిగను, పాణిని క్రీ.పూ. 1000-1100 సం॥రల వానినిగను పేర్కొనెను. పం. యుధిష్ఠిర్ మీమాంసకులు 'సంస్కృత

వ్యాకరణ శాస్త్ర చరిత్ర' యను తన పరిశోధనా గ్రంథమున వైయ్యాకరుణుడైన పాణినిని యింకనూ ప్రాచీనునిగ లెక్కించెను. పాణిని అష్టాధ్యాయిలోని ఈ క్రింది సూత్రములు మహాభారత చరిత్రను గూర్చి తెలుపును. (6-2-38) సూత్రమునందు గల 'భారత' శబ్దము మహాభారతమునకు వాచకమే. 'గవియుధిమ్యాం స్థిరః' (8-3-95) అను సూత్రమునందు యుధిష్ఠిరుని (ధర్మరాజు) గూర్చి చెప్పబడినది. 'స్త్రియామవంతి కుంతి కురుభ్యశ్చ' (4-1-174) అను సూత్రములో పాండురాజు, కుంతిని గూర్చి చెప్పబడినది. ఇదే విధముగ నకుల ద్రోణులను గూర్చి (6-3-75) మరియు (4-1-103) సూత్రములలోను, కృష్ణార్జునుల నిరువురను గూర్చి 'వాసుదేవార్జు నాభ్యాం వున్' (4-3-98) అను సూత్రమునందును చెప్పబడినది. ఉపనిషత్తులు పాణినికన్నను ప్రాచీనములు. ఛాందోగ్యపనిషత్తు (3-16-6) లోను, కౌషతకీ బ్రాహ్మణము నందును కృష్ణుని గూర్చి ఆయన గురువు ఘోరఅంగీరసులను గూర్చి చెప్పబడినది. వీరు మహాభారతము నందలి యాదవ కృష్ణుడేయని నిశ్చయముగ చెప్పవచ్చును. ఈ విధముగ ప్రాచీన ఆర్ష సాహిత్యమునందు శ్రీకృష్ణుని గూర్చి యనేక చోట్ల వర్ణన యున్నందున ఆయనొక చారిత్రిక పురుషుడుగ సిద్ధమగును.

వెబరు పేర్కొన్న భారతదేశమును సందర్శించిన చైనా యాత్రికుడు మెగస్థనీసు తన గ్రంథములో భారతదేశములో ప్రసిద్ధ దేవతగ వర్ణించిన 'హిరాక్లీస్' శ్రీకృష్ణుడే. చైనీయులు భారతీయ పేర్లను తమ భాషలో వ్రాసిరి. ఆ యాత్రికుడు హిరాక్లీసును శౌరసేనీయులు పూజించుచుండిరని వారి ముఖ్య పట్టణము మిథోరా (మథుర) యని వ్రాసిరి.

ఈ విధముగ పైన తెలిపిన ప్రమాణముల ద్వారా శ్రీకృష్ణుడొక చారిత్రిక పురుషుడుగ సిద్ధమగును. శ్రీకృష్ణుని పేర ఒకానొక వ్యక్తి ఎవరునూ జన్మించి యుండకపోయినచో, ఆయన తరువాత ఒక చారిత్రక పరంపర ఆవిర్భవించుట గాని, ఆయన కోట్లాది ప్రజల హృదయములలో నొక ఆరాధ్య దేవత స్థానమును పొందుట కవకాశముగాని యుండెడివి కావు.

**గోపికల ప్రసంగము:**

మహాభారతములో కృష్ణ-గోపికలను గూర్చి ప్రసంగమెచ్చటను కనబడదు. కనుక ఈ ప్రసంగములు తరువాతి తరములలోని పౌరాణికుల కల్పనయేనని స్పష్టమగుచున్నది.

వాస్తవముగ నాలోచించిన పౌరాణిక వ్యాఖ్యానకర్తల వాదము చాలా నిస్సారమైనదిగ తోచును. వేదములలో ఆత్మ పరమాత్మల సంబంధమును జార భావనకు సంబంధించిన భక్తి విధానముగ నెచ్చటను వర్ణింపలేదు. జీవాత్మరూపస్త్రీ పరమాత్మరూప పురుషుని పతిగ దాంపత్య భావముతోనే పొందునను మాటలో కూడ ఔచిత్యము లేదు. వేదములలో ఈశ్వరజీవుల సంబంధము పితా-పుత్ర, రాజా-ప్రజ. స్వామి-సేవక, గురు-శిష్య, మిత్ర-మిత్ర సంబంధముగ వర్ణింపబడినది. కాని పతి పత్ని భావము, ప్రేమికుల భావమెక్కడను చెప్పబడలేదు. ఉపాసనలో నీ మాధుర్య భావన మొదట వామమార్గమున కంగముగ నేర్పడినది. తరువాత బౌద్ధ మతమున వ్యాపించినది. వారినుండి వైష్ణవులు గ్రహించిరి. వైష్ణవులలో కూడ సఖీ సంప్రదాయములోని ఈ జార భావముతో కూడిన భక్తి, ఘోర అతివాదముగ వ్యక్తమైనది. కనుక కృష్ణ-గోపికల ప్రేమను అభౌతికము, ఆధ్యాత్మికమని చెప్పి పౌరాణికులు స్థూల విషయ వాసనతో కూడిన దాని రూపమును ఎవరి దృష్టినుండి మరల్చలేరు. తరువాత కృష్ణుడు రాసలీలల సమయమున 10 సం॥రం॥లు ప్రాయముగల వాడనుట కూడ పురాణములకు విరుద్ధము. అందుకు భాగవతములోని (10-29-46) (10-33-13) (10-33-14) శ్లోకములే సాక్ష్యము. వీనిని చూచేపాపము పరీక్షిత్తు మహారాజు కూడ శ్రీకృష్ణుని లోక విరుద్ధాచరణ విషయములో సందేహము కలిగి పురాణవక్త శుకుని యిట్లడిగెను.

శ్లో॥ సంస్థాపనాయ ధర్మస్య ప్రశామయేతరస్య చ।
అవతీర్ణోహి భగవానంశేన జగదీశ్వరః ॥
సకథం ధర్మసేతూనాం వక్తా కర్తాऽభిరక్షితా ।
ప్రతీప మాచరద్ బ్రహ్మన్ పరదారాభి మర్షనామ్ ॥ (భాగవత. 10-33-27,28

బ్రహ్మన్! మీరు ధర్మ సంస్థాపన కొరకు అధర్మమును నాశనమొనర్చుటకు భగవానుడు అవతారములను ధరించునని వచించిరి. అట్టి ధర్మరక్షకుడైన భగవానుడు (శ్రీకృష్ణుడు) పరస్త్రీలను స్పృశించుటయను అధర్మ కార్యము నెట్లొనర్చెనని పరీక్షిన్మహారాజు ప్రశ్నించెను. దానికి శుకదేవు డిచ్చిన సమాధానము పాఠకులకు సంతృప్తిని కలిగింపకపోగా దానిలో నేదో దోషమున్నట్లు నిర్ధారితమగును. శుకుని సమాధానమేమన - 'సమర్థులైన వారికి దోషములంటవు. ఎట్లన: సర్వహుత అగ్నిలో మంచి చెడు పదార్థములన్నియు భస్మమగును' అని. ఇది సంతోషదాయకమైన జవాబేనా? కృష్ణుని పరస్త్రీ సమాగమరూప పాపకృత్యమును. భాగవతమును సమర్థించు

సామాన్య జనులు అనుసరించు టారంభించిన సమాజము గతేమగును? సర్వనాశనము కాదా? అట్లు చేయుట వలన సమాజములో ఉచ్ఛృంఖలత (విచ్చలవిడితనము) అరాచకతలు వృద్ధిజెంది దానికి భాగవతము వంటి గ్రంథములు బాధ్యులుగ దోషులుగ నిలుపబడవా? గోపాల సహస్ర నామములో 'గోపాలఃకామినీ-జారః చౌరజార శిఖామణిః' యని సంబోధింపబడినది. ధర్మ గ్రంథములని పిలువబడు వాని స్థితి యిట్లున్నచో యితర కావ్యాదులలో నింకెట్లుండునో ? నిరంకుశులైన కవులు మర్యాదకు తిలోదకములిచ్చి కృష్ణ చరిత్రను సర్వభ్రష్టమొనర్చిరి.

**రాధా-కృష్ణుల సంబంధము :**

కృష్ణ చరిత్రను గూర్చి ముఖ్యముగ తెలుపు మహాభారత, విష్ణుపురాణ, భాగవత పురాణములలో రాధను గూర్చి ఎక్కడా చెప్పలేదు. ఒక్క బ్రహ్మవైవర్త పురాణములోనే రాధను గూర్చి చెప్పబడినది. చాలా సంవత్సరముల క్రిందట ప్రసిద్ధ నాటక రచయిత నారాయణ ప్రసాద్ బేతాబ్ - 'రాధాకృష్ణుల సంబంధ' మనునొక చిన్న పుస్తకమును వ్రాసెను. దానిలో రాధాకృష్ణులను తండ్రి-కుమార్తెలను, తల్లి-కుమారునిగ, భార్యాభర్తలుగ, బ్రహ్మవైవర్త పురాణ ఆధారముగ ప్రమాణములో నిరూపించెను. చివరకా రచయిత అత్యంత వినయముతో - ' ఈ సంబంధములలో రాధతో మీకే సంబంధమో దయతో తెలుపుడని' శ్రీకృష్ణ భగవానునే ప్రశ్నించును! ఇవన్నియు సత్యమేనా? లేక అన్నీ అసత్యములా? లేక వీనిలో యొకటి సత్యము. మిగిలినవన్నియూ అసత్యములా? యని వివేచించుచు చివరకాయన పురాణములలో రాధకు చెప్పిన సంబంధము లన్నియు కల్పనలనియు, బ్రహ్మవైవర్త పురాణమున తప్ప మరెచ్చటా ఈ ప్రసంగము లేదనియు నిశ్చయముగ తెలిపెను.

**రాధ కృష్ణుని పుత్రిక :**

బ్రహ్మవైవర్త పురాణములోని బ్రహ్మఖండమునందలి 5వ అధ్యాయములో రాధ జననమిట్లు చెప్పబడును.

**శ్లో॥ ఆవిర్బభూవ కన్యైకా కృష్ణస్య వామపార్శ్వతః । (25)**
**తేనరాధా సమాఖ్యాతా పురావిద్భిర్ద్విజోత్తమ ః ॥ (26)**

కృష్ణుని ఎడమ భాగమునుండి ఒక కన్య జన్మించినది. పురాకల్పము నెరింగిన బ్రాహ్మణులామెకు రాధయని పేరు పెట్టిరి. తరువాత శ్లోకములో రాధను కృష్ణుని ప్రాణ సమానదేవిగ, కృష్ణుని ప్రాణములనుండి జన్మించి నట్లుగ వ్రాసెను. ఈ విధముగ పురాణములలో వదతో వ్యాఘాత దోషము' స్పష్టముగ కనబడును.

రాధ కృష్ణుని పత్ని :

ప్రకృతి ఖండమునందలి 48వ అధ్యాయములో మహాదేవుడు రాధను కృష్ణుని భార్యయని చెప్పెను. 'స్వయం రాధా కృష్ణపత్నీ కృష్ణవక్షఃస్థలా స్థితా ' (47). రాధాకృష్ణుల వివాహము స్వయముగా బ్రహ్మ పౌరోహిత్యమున జరిగెను.

'పాణిం జగ్రాహ రాధాయాః స్వయం బ్రహ్మ పురోహితః । (88)

రాధ కృష్ణుని అత్త :

ప్రకృతి ఖండమునందలి 49వ అధ్యాయములో ఈ క్రింది శ్లోకము గలదు.

శ్లో॥ రాధా జగామ వారాహే గోకులం భారతం సతీ ।
వృషభానోశ్ప వైశ్యస్య సాచ కన్యా బభూవ హ ॥ (35)

శ్లో॥ అతీతే ద్వాదశాబ్దే తు దృష్ట్వాం తాం నవయౌవనామ్ ।
సార్థం రాయాణవైశ్యేన తత్సంబంధం చకార స॥ (37)

వరాహ కల్పములో రాధ గోకులమునందలి వృషభాను కుమార్తెయయ్యెను. ఆమెకు 12 సం॥ల వయస్సు రాగానే రాయాణవైశ్యునితో వివాహ సంబంధము నిశ్చయమైనది. రాయాణుడు కృష్ణుని తల్లి యశోద సోదరుడు. ఆ విధముగ రాధ, కృష్ణుని మాతుల పత్ని - అత్త.

రాధ కృష్ణుని తల్లి :

పురాణమునందలి ఈ కథలో శ్రీకృష్ణుడా సమయములో బాలకుడుగ నుండెను. ఒకనాడు నందుడు గోవులను మేపుటకై అరణ్యమునకు పోవుచు కృష్ణుని వెంట తీసుకువెళ్లెను. అకస్మాత్తుగా నచ్చట కుంభవర్షము కురియుటారంభింపగా ఆ బాలకుని సురక్షితముగ యింటికెట్లు చేర్చుటాయని నందుడాలోచించుచుండగా రాధ అకస్మాత్తుగా అచ్చటకు వచ్చినది. ఏడ్చుచున్న ఆ బాలుని నందుడు రాధ కివ్వగా ఆమె కృష్ణుని తీసుకొనిపోయెను. తరువాత బాలకుడు కృష్ణుడు కూడ నొక పరమ సౌందర్యవంతుడైన నవయువకునిగ తయారయ్యెను. తదుపరి వారిరువురు విచ్చలవిడిగ జరిపిన కామ క్రీడలను పురాణకారుడు వర్ణించిన తీరు అద్వితీయమైనది. బ్రహ్మవైవర్తము వంటి కామ వాసనలతో కూడిన శృంగార లీలల వర్ణన గల గ్రంథమును వ్యాసుడు వ్రాసిన ధర్మ గ్రంథముగ పిలిచినచో యిక కామశాస్త్రమని దేనిని పిలువవలయును?

శ్లో॥ కరే ధృత్వాచ తాం కృష్ణః స్థాపయామాస వక్షసి ।
చకార శిథిలం వస్త్రం చుంబనంచ చతుర్విధమ్ ॥ (148)

కృష్ణుడు రాధను గట్టిగా పట్టుకొని తన గుండెలకు హత్తుకొనెను. ఆమెను వివస్త్రను చేసి చతుర్విధ చుంబనము సలిపెను.

శ్లో॥ మూర్ఛామవాప సా రాధా బుబుధేన దివానిశమ్ । (151)

రాధ నూతన సమాగమముచే మూర్ఛితురాలైనది.

శ్లో॥ శృంగారాష్టవిధం కృష్ణశ్చకార కామశాస్త్రవిద్ । (152)

కామశాస్త్రము నెరిగిన కృష్ణుడు అష్టవిధ మైథునమును చేసెను. ఆ బాలుని తిరిగి తన ఒడిలో వేసుకొని రాధ యశోద వద్దకు వెళ్ళి

శ్లో॥ గృహాణ బాలకం భద్రే స్తనం దత్త్వా ప్రబోధయ (175)

ఓ యశోదాదేవి! నీ బాలుని తీసుకొని పాలిచ్చి ఊరడించుము అనెను.

బ్రహ్మవైవర్త పురాణమునందలి యిటువంటి ప్రసంగములలో రాధాకృష్ణుల విలాసలీలల వర్ణన భారతీయ సంస్కృతి కత్యంత విరుద్ధములైనను పురాణములను సమర్థించువారు కొందరు ఈ ప్రసంగములన్నియు 'ఆధ్యాత్మిక భావములను తెలుపుననుచు యిట్లు సమర్థించుచుందురు.

1. రాధాకృష్ణుల సంబంధము అలౌకికమై దివ్యమైనది. దానిలో కామవాసనలకు తావులేదు.

2. ప్రసిద్ధ వైదిక విద్వాంసులు స్వ. పం శ్రీపాద దామోదర్ సాత్వలేకర్ గారొకచోట వ్రాయుచు, రాధకు కృష్ణుని యెడల పవిత్రభక్తి భావములతో కూడిన సంబంధముండెను. దీనిని కామ వాసనలతో కూడిన భావముతో చూచుటపరాధమనిరి.

3. కృష్ణ చరిత్రపై పరిశోధనాత్మక సమాలోచన జరిపినట్టి బంకించంద్రుని వంటి వ్యక్తి, రాధ పాత్రను పురాణకర్తల కల్పనగ నెంచు వ్యక్తి కూడ పురాణములలోని అసత్య కథలను త్యజించు సాహసములేక రాధాకృష్ణుల సంబంధము ప్రకృతి పురుషులతో కూడిన రూపకాలంకారిక వర్ణనగా సమర్థింతురు. ఇప్పుడీ విద్వాంసుల తర్కముపై సమాలోచన జరిపెదము :

1. రాధాకృష్ణులను ప్రకృతి పురుషులుగ చెప్పుటకు వారివద్ద గల శాస్త్ర ప్రమాణమేమి ?

ప్రకృతి పురుషుల వర్ణనగల సాంఖ్య దర్శనమునందలి మూల సూత్రములందుగాని, వాని వ్యాఖ్యానమున గాని, పురాణములందు వర్ణించిన ఈ ప్రసంగమున కాధారమేదైనా చూపుటకు వీలున్నదా? అట్లు సాధ్యము కానిచో సాంఖ్య శాస్త్రముద్వారా రాధాకృష్ణుల సంబంధమును సిద్ధమొనర్చుట ఇసుకనుండి తైలమును తీయు చందమున అసంభవము.

2. పురాణములలో నెచ్చటైనను రాధను మూల ప్రకృతిగను, కృష్ణుని పురుషునిగను వర్ణించిన, నది బాగుగనే యున్నది. కాని పురాణకర్తకు వారి ఈ సంబంధమును స్థూల సంభోగాత్మకమైనదిగ వర్ణించు యవసరమేల కలిగినదను విషయమే అన్వేషింపదగినది.

రాధాకృష్ణుల ప్రేమ వ్యవహారమునగల ఈ నిరాధారమైన కల్పన దేశచరిత్ర నెంత వికృతమొనర్చినదో వర్ణనాతీతము. మన దేశములో పురాణ పురుషుల ఆచార వ్యవహారములు, చరిత్ర, ఓజస్సు, తేజస్సు, బల పరాక్రమములన్నియూ యిట్టి దూషిత శృంగార కథలతోనే కలుషిత మొనర్చబడి నష్టము గావింపబడినవి. వారి భక్తులు జరుపు వ్యభిచారాది దుష్కర్మలకు ప్రోత్సాహమిచ్చుట కిట్టి కల్పిత కథలే కారణము. ప్రసిద్ధ పురాతత్వ శాస్త్రకారుడు డా॥ రామకృష్ణ గోపాల భండార్కర్ గారిట్లు వ్రాసిరి. కృష్ణుని కంటె రాధకు అధిక ప్రాధాన్యతనిచ్చు సంప్రదాయ భక్తులు స్త్రీ మాసిక ఋతు ధర్మమును కూడ నభినయింతురు. వారు ప్రజలలోనికి కూడా రారు. రాధకు పరిచారికలుగ కావలయునని వారి యుద్ధేశ్యము. ఈ యభినయమునకు వారు 'సఖీభావన' యని పేరుపెట్టిరి.

**రుక్మిణితో పరిణయము :**

పురాణములలో కృష్ణున కనేక పత్నులున్నట్లు చేసిన ఆరోపణలన్నియు కల్పితములు. వాస్తవముగ రుక్మిణియే కృష్ణుని వివాహితపత్ని. ఆమె విదర్భ రాజు భీష్మకుని కుమార్తె. రుక్మిణీ సోదరుడు రుక్మి తన సోదరిని చేదిరాజు దంఘోషుపుత్రుడు శిశుపాలునితో వివాహము చేయుటకు నిశ్చయించెను. కాని రుక్మిణీ మాత్రము కృష్ణుని ప్రేమించినది. రుక్మిణీ పంపిన సందేశము నందుకొని కృష్ణుడు విదర్భ రాజధాని కుండినపురమునకు వచ్చి నగరమునకు వెలుపలనున్న ఉద్యానవనములో వేచియుండి రుక్మిణీ రాగానే రథములో కూర్చుండబెట్టుకొని ద్వారకా పట్టణమునకు బయలుదేరెను. అది చూచిన శిశుపాలుడు తన సైన్యముతో కృష్ణుని వెంబడింపగా బలరాముడు తన యాదవ సైన్యముతో నతని నెదుర్కొని తరిమికొట్టెను. రుక్మిణి

కూడా శ్రీకృష్ణుని వెంబడించి పోరాడగా కృష్ణుడతనిని పట్టుకొని ముండనము గావించి పరాభవించెను. రుక్మిణీ బలరాముల కోరికపై అతనిని విడిచిపెట్టి రుక్మిణీతో ద్వారకకు చేరి వైదిక పద్ధతిలో పరిణయమాడెను. మనుస్మృతిలో చెప్పబడిన అష్టవిధ వివాహములలో రాక్షస వివాహమొకటి. తనకు నచ్చిన వరునితో వివాహము చేయుటకు పెద్దలంగీకరింపనపుడు వధువు ప్రార్థనపై వరుడామెను హరించి వివాహమాడుట రాక్షస వివాహము. రాక్షస వివాహమనుచితముగ భావింపబడు కృష్ణుని యుగములో కాలానుగుణముగ ఆనాటి ఆచార వ్యవహారములకది ఉచితముగనే తోచును.

**బహు వివాహముల ఆరోపణ అసత్యము :**

పురాణకర్తలు శ్రీకృష్ణుని ఏకపత్నీ వ్రతముతో సంతోషింపక ఆయన కెనిమిది మంది పట్టపురాణులు గలరని కథలల్లిరి. భాగవతములో రుక్మిణీగాక 1) సత్యభామ 2) జాంబవతి (విష్ణు పురాణములో ఈమె పేరు రోహిణీ 3) కాలిందీ 4) సత్యా 5)లక్ష్మణా 6) మిత్రవృన్దా 7) భద్రా అను ఏడుగురు భార్యల పేర్లు గలవు. వీరితో కృష్ణుని వివాహమునకు వేర్వేరు కథలనల్లిరి. కృష్ణుడు ప్రాగ్జ్యోతిషపుర రాజైన నరకాసురుని చంపి 16వేల స్త్రీలను వివాహమాడినట్లుగ భాగవతమునందలి 59వ అధ్యాయములో గలదు. ప్రథమమున నరకాసురుని సేనాపతి 'మురి' అను వానిని చంపినందున 'మురారి' అని కృష్ణునకు పేరు వచ్చినది. నరకాసురుని చెరలోనున్న 16వేల రాజ కుమార్తెలను చెరనుండి విడిపించి వారిని పత్నులుగ గ్రహించెను.

బంకించంద్రుడు ఈ ఘట్టములన్నింటిని అలౌకికము, మిథ్యలుగా నెంచును. కృష్ణుని సమకాలీన ప్రాగ్జ్యోతిషపుర రాజు నరకాసురుడు కాక కురుక్షేత్ర యుద్ధములో అర్జునుని చేతిలో మరణించిన భగదత్తుడని ఆయన వాదము. మహాభారతమున కూడ ఈ విషయమున్నది. కనుక 16వేల రాణులతో కృష్ణుని వివాహ మసత్య ఆరోపణయని ఆయన తన కృష్ణచరిత్రయను గ్రంథమున 221వ పేజిలో వ్రాసిరి. స్వ. పం. శ్రీపాద దామోదర్ సాత్వలేకర్ గారు 16 వేల స్త్రీలతో వివాహ విషయముననొక విచిత్ర వాదనను చేసిరి. అదేమన - నరకాసురుడు విభిన్న రాజ్యముల నుండి 16 వేల రాకుమార్తెలను తెచ్చి తన కామవాంఛను తీర్చుకొనుటకై అంతఃపురమున నుంచెను. కృష్ణుడా నరకాసురుని చంపి వారందరినీ చెరనుండి విడిపించి తన అంతఃపురములో స్థానమిచ్చి అబలల నుద్ధరించి వారి సంరక్షణ భారమును తాను వహించి ఒక క్రొత్త ఆదర్శమును నెలకొల్పెనని వారు వ్రాసిరి. కాని 16 వేల స్త్రీలనుపత్నులుగ స్వీకరించి కృష్ణుడు నెలకొల్పిన ఆయాదర్శమేమిటో? నరకాసురునిచే

చెరబట్టిన స్త్రీలను తిరిగి గ్రహించుట కెవరును సిద్ధముగ లేరనుకున్నను వారిని తన పత్నులుగ జేసుకొనుటొక్కటి తప్ప వేరొక మార్గమే లేదా? ఆర్యజాతిలో ఏకపత్నీ వ్రతము ఆదర్శముగ, నెంచబడుచున్నది. బహుభార్యాత్వము వైదిక సంస్కృతికి సర్వదా విరుద్ధము, నింద్యము. కనుక 16 వేల స్త్రీలను వివాహమాడుట మంచి ఆదర్శముకాదు. సాత్వలేకర్ గారన్నట్లు స్త్రీ సంరక్షణే సమస్యయైనచో వారినొక ఆశ్రమమున నుంచవచ్చును గదా?

ఈ కథలను అసత్యముగ నిరూపించుటకై బంకింబాబు అత్యంత శ్రమపడి చివరకు మహత్త్వపూర్ణమైన ఈ క్రింది సారాంశమును వ్రాసిరి. "మహాభారతము నందలి మూల అంశములను బట్టి రుక్మిణీ తప్ప కృష్ణునకు మరొక భార్య లేనట్లు ప్రమాణములు కనబడును. రుక్మిణీ సంతానమే తరువాత రాజసింహాసనము నధిష్ఠించెను. వేరొక వంశము వారెవరును కనబడరు. కనుక శ్యమంతకమణితో ఆయనకు సత్యభామాది స్త్రీలు లభించిరనుట, నరకాసురుని 16వేల రాణులకథ నాన్నమ్మ కథలే (కల్పిత కథలే). ఈ కథలు విని సంతోషింపదగినవేగాని నమ్మదగినవి కావు."

శ్రీకృష్ణ చరిత్రను వ్రాయుచు శ్రీలాలా లజ్‌పత్‌రాయ్ గొప్ప మార్మిక శబ్దములను వ్రాసిరి. "ప్రపంచములో మహాపురుషులపై అనేకమంది విరోధులు అత్యాచారముల నొనర్చిరి. కాని మహాపురుషుడైన శ్రీకృష్ణునిపై ఆయన భక్తులే అనేక దోషారోపణల నొనర్చిరి. శ్రీకృష్ణుడు భక్తుల అత్యాచారములకు ఎరగానైరి . అగుచుండిరి. సాధారణముగ శ్రీకృష్ణుడే క్రొత్తక్రొత్త అవతారములను ధరించుచుండును. శ్రీరాముడు అవతారములను ధరించుట ఎప్పుడైనా విందుమా? ఇరువురను విష్ణు అవతారముగనే ఎంచుదురు. శ్రీకృష్ణుని వంటి వ్యక్తి ఈ దేశమునందేకాక ప్రపంచమునందు కూడ ఇంతవరకు జన్మింపలేదు. ఆర్యమర్యాదా రక్షకుడైన శ్రీరామునితో శ్రీకృష్ణుని వ్యక్తిత్వమును పోల్చవచ్చునుగాని యిరువురు జీవించిన యుగములు, వారి కాలము నాటి జీవనపరిస్థితులలో మూలభేద ములు కలవు. శ్రీరాముడు స్వయముగ ఒక ఆదర్శ మూర్తియైన రాజు. కాని శ్రీకృష్ణునకు ఆదర్శ రాజ్యమును స్థాపించు కార్యమును స్వయముగ చేయవలసి వచ్చెను. శ్రీకృష్ణుడు ఎందరినో రాజులుగచేసి తాను స్వయముగ రాజ్యాధికారమునకు దూరముగనున్నట్టి సామ్రాజ్య సంస్థాపకుడు. శ్రీకృష్ణు డెదుర్కొన్న సమస్యలు శ్రీరామునకు లేకుండెను. అందువలన ఎటువంటిదృష్టితో ఏ విధముగ చూచినా శ్రీకృష్ణుని చరిత్ర వ్యక్తిత్వములు భూమండలమున అద్వితీయములుగ గణింపబడును.

ఓ౩మ్

# యుగపురుషుడు శ్రీకృష్ణుడు

## శ్రీకృష్ణుని చరిత్ర

ప్రతి దేశమునందు ప్రతిజాతియందు అప్పుడప్పుడు మహాపురుషులుద్భవించి సమాజములో వ్యాప్తిచెందిన కురీతులను రూపుమాపి దేశమును దుస్థితినుండి ఉన్నత స్థితికి కొనిపోయి సభ్యత, దేశాభివృద్ధులను మహోన్నతదశకు తీసుకొని పోవుదురు. అట్లే ఋషులు మునులు జన్మించిన పవిత్ర పుణ్యభూమియైన ఈ భారత భూమిపైకూడ గొప్పగొప్ప మహాపురుషులెందరో ఆవిర్భవించుట జరిగినది. వేలాది ఋషి మునులు, పరాక్రమవంతులైన రాజులు, విద్వాంసులు, మహాపురుషులు యిచ్చట జన్మించినను మర్యాదా పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు మరియు యోగిరాజు శ్రీకృష్ణునిపై ప్రజలకు అత్యధిక శ్రద్ధా భక్తులు, ఆదరము గలవు. సుమారు 5వేల సం॥రములకు పూర్వము ద్వాపరయుగమందలి అంతిమ చరణమున ఈ భరతవర్షమున ధనధాన్యాదులతో తులతూగు చుండునట్టి చిన్న పెద్ద ఆర్య స్వతంత్ర రాజ్యము లనేకము లుండెడివి. ఇంతటి సుఖములతో కూడియుండియు ఆ క్షత్రియరాజులు జూద మద్యపానాది దుర్వ్యసనములలో మునిగి తేలుచు దురాచారులు, అత్యాచారులుగ నున్నందున ప్రజలు నానాదుఃఖముల ననుభవించుచుండెడివారు. అట్టి విపత్కర సమయమున శ్రీకృష్ణుడు జన్మించెను.

భాగవతాది పురాణములలో శ్రీకృష్ణుని జననము కంసుని కారాగారములో అస్వాభావిక రూపములో చిత్రింపబడెను. పుట్టినపుడు నాలుగు భుజములుండి తరువాత రెండయ్యెను. కంసుడు తన తండ్రి ఉగ్రసేనుని సింహాసనము నుండి తొలగించి కారాగారమున నుంచి 'శూరసేన' దేశమునకు తానే రాజయ్యెను. రాజధాని మథుర. కంసుని సోదరియైన దేవకి వసుదేవుని రెండవ భార్య. కృష్ణుడు దేవకీ వసుదేవుల పుత్రుడు. దేవకీ పుత్రుని వలన తనకు మరణము సంభవించునని ఎవరో కంసునకు చెప్పుట వలన అతడు దేవకికి పుట్టిన ఏడుగురు పుత్రులను పుట్టుటతోనే చంపివేసెను. ఎనిమిదవ గర్భమున జన్మించువాని వలన కలిగిన భయముతో చింతితుడయ్యెను. కంసుని అత్యాచారములకు భయపడిన వసుదేవుడు గర్భవతియైన తనపత్ని రోహిణిని తనమిత్రుడైన నందునివద్ద నుంచగా ఆమెకు బలరాముడు జన్మించెను. కంసుడు దేవకీ వసుదేవులను తన గృహమున బందీలుగా నుంచెను. దేవకికి అష్టమగర్భమున శ్రీకృష్ణుడు జన్మింపగనే వసుదేవుడు శ్రీకృష్ణునికూడ నందుని వద్దకు తీసుకొనిపోయి విడిచివచ్చెను. అచ్చటనే బలరామ శ్రీకృష్ణుల బాల్యము గడచెను. గోకులముననుండి శ్రీకృష్ణుడు మల్లయుద్ధములో అతి ప్రావీణ్యతను సంపాదించి పిన్నవయస్సులోనే బలశాలియైన మల్లునిగ తయారయ్యెను.

యునానీ (చైనా) రాయబారి మెగస్థనీస్ మథురా నగరమును వర్ణించుచు మథురవాసులు 'హిరాక్లీస్'ను పూజించుచుండిరని వ్రాసెను. ఆ హిరాక్లీస్ మరెవరో కాదు - శ్రీకృష్ణుడే. గ్రీకు భాషలో కృష్ణుని 'హిరాక్లీస్' అందురు. ఆ సమయమున 'డయోనిసస్'అను రాజు యునాన్‌ను పాలించుచుండెను. యునాన్ రాయబారి భారతదేశమునకు చంద్రగుప్తుని కాలములో వచ్చెను. డయోనిసస్ నుండి చంద్రగుప్తుని వరకు 153 తరముల అంతరమున్నట్లు అతడు సాక్ష్యాధారములతో వ్రాసెను. ఆ డయోనిసస్‌ను శ్రీకృష్ణునికంటె 15 తరముల ముందువానినిగ చెప్పుచుందురు. ఈ విధముగ శ్రీకృష్ణుడు చంద్రగుప్తుని కంటె 153-15=138 తరముల ముందువాడు. చరిత్రకారుల లెక్కల ననుసరించి ప్రతి తరమునకు 20సం॥లు (సరాసరి) గ లెక్కించినచో 138X20=2760 సం॥లగును. చంద్రగుప్తుడు క్రీస్తుకంటె 312 సం॥లు పూర్వముండెను. ఇప్పుడు 1988 సం॥లో శ్రీకృష్ణుని పూర్తికాలము = 2760 + 312+1988=5060 సం॥లు. అనగా సుమారు 5వేల సంవత్సరాలైనవి.

బలరామ కృష్ణులు వసుదేవుని పుత్రులని, వసుదేవుడు వారినచ్చట రహస్యముగ దాచియుంచినట్లు తెలుసుకున్న కంసుడు అచ్చటనే వారిని హతమార్చుటకు నిశ్చయించి పిశాచిని పూతనను, అఘాసురుడు మున్నగు ననేక దుష్టులను కృష్ణుని చంపుటకై వ్రజదేశమునకు పంపెను. కాని తన బలపరాక్రమములతో శ్రీకృష్ణుడు వారినందరిని హతమార్చెను. అన్నదమ్ముల నిరువురను చంపుటకై దుష్టుడైన కంసుడు మరొక ఉపాయము నాలోచించెను. అతడు తన వద్దనున్న మల్లుడు చాణూర్ మరియు ముష్టికులతో మల్లయుద్ధము చేయుటకై బలరామ కృష్ణులను మథురా నగరమున కాహ్వానించెను. అచ్చట కృష్ణుడు వారిరువురను మల్ల యుద్ధములో చంపి అత్యాచారియైన కంసుని కూడ చంపి ప్రజల దుఃఖములను తొలగించెను.

శ్రీకృష్ణుని జీవితమును రెండు భాగములుగ విభజింపవచ్చును. మొదటి భాగము కంసవధకు పూర్వము. రెండవ భాగము కంసవధ తరువాత. కంసవధ తరువాతనే శ్రీకృష్ణుడు లోక ప్రసిద్ధి గాంచెను. కంసవధకు పూర్వకాలమును భాగవతకారుడు వర్ణించెను. భాగవతములోని 10, 11 అధ్యాయములలో శ్రీకృష్ణుని బాల్యవర్ణన విస్తారముగకలదు. ఈ వర్ణన కామ, మోసపూరిత ఘటనలతో నిండియున్నది. ఇందులో కృష్ణుడు పిల్లనగ్రోవి ఊదువాడు, వెన్నదొంగ, పశువులకాపరి. అతని పిల్లనగ్రోవి స్వరమును గోపికలు ముగ్ధులై వినుచుందురు. అతని సౌందర్యమునకు వారు మోహితులై అతనిని పతిగ నెంచుదురు. గోపికలతో శ్రీకృష్ణుని రాసలీల వర్ణనగలదు. ఈ వర్ణన చూచినచో శ్రీకృష్ణుడు మహాకాముకుడుగ, విషయలంపటుడుగ, ఇంద్రియలోలుడుగ కనుపించును. ఉదాహరణకు భాగవతము నందలి ఈ ప్రసంగమును చూడుడు -

శ్లో ॥ బాహుప్రసార, పరిరంభ, కరాల, కోరునీవీ
స్తనాలభన, నర్మనరవాగ్ర పాతేః।
క్ష్వేల్యా zవలోక హసితే, బ్రజసుందరీణా
ముత్తభ్యయన్, రతిపతీ రమయాంచకార ॥

అర్థము : బాహువులుచాచుట, బంధించుట, మెడను చుట్టుకొనుట, కటివస్త్ర బంధనమును (-) స్తనములను తాకుట (-)

మత్తుతో కూడిన దృష్టితో చూచుట, మందహాసములు మున్నగు కామ ప్రకోప చేష్టలతో శ్రీకృష్ణుడు గోపికలతో రమించు (క్రీడించు) చుండెను. కుబ్జతో

సమాగమము, గోపికల వస్త్రముల నపహరించి వారిని పూర్ణ నగ్నముగ చూచుట మున్నగునవి వర్ణించి భాగవత టీకాకారుడైన శ్రీ శ్రీధర్ అనువాడు గోపికలను ఆటవికులు, వ్యభిచారిణులు, అతిదుష్టులుగను; ఆ వ్యభిచార గోపికలతో కూడిన శ్రీకృష్ణుని జార చోర శిఖామణిగను సంబోంధించెను.

ఈ పురాణములోనే శ్రీకృష్ణుడు సంధ్యావందన మొనర్చుచున్నట్లు కూడ వర్ణించెను.

శ్లో ॥ బ్రాహ్మేముహూర్త ఉత్థాయోప స్పృశ్య మాధవః ।
సంధ్యాయా ప్రసన్నకరణ ఆత్మానం తమసః పరమ్ ॥ (4)
**అథాప్లుతో z మ్భస్యమలే యథావిధి క్రియాకలాపం పరిధాయ వాససః ।**
**చకార సంధ్యోపగమాది సత్తమో, హుతానలో బ్రహ్మజజాప వాగ్యతః ॥ (6)**

అర్థము: ప్రతి దినము శ్రీకృష్ణుడు బ్రహ్మ ముహూర్తములో నిద్రలేచి నిత్యకర్మల నాచరించిన పిదప ఈశ్వర ధ్యానమొనర్చును. అప్పుడతని కత్యధిక ఆనందము కలుగుచుండును. (4)

తరువాత ఆయన స్నానమొనర్చి శుభ్రవస్త్రమును ధరించి సంధ్యాగ్ని హోత్రములు నొనర్చి గాయత్రీ జపమొనర్చుచుండిరి (6)

తరువాత ఈ పురాణములోనే శ్రీకృష్ణుని వేదవేదాంగ విదుడు మరియు ధనుర్వేదమున పూర్ణ విద్వాంసునిగ వర్ణించెను. నిత్యసంధ్యాగ్ని హోత్రములకర్త, వేదవేదాంగవేత్తయైన శ్రీకృష్ణుని ఇంతటి అసహ్యపూరిత చరిత్రునిగ భాగవతకారు డెందులకు వర్ణించెనో అర్థముకాని విషయము.

శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమునెత్తుట, వృషాసురుని వధించుట, కాళిందీ మడుగులోని పాముపై నాట్యమాడుట మున్నగు ఘటనల వర్ణన కేవలము చమత్కారములు మాత్రమే. భయంకర విషనాగులను పాముల నాడించువాడు కూడ వశము చేసుకొనును.

## మహాభారతములోని శ్రీకృష్ణుడు

మహాభారతములో మహర్షి వ్యాసుడు శ్రీకృష్ణుని చరిత్ర నత్యుత్తమముగ వర్ణించెను. వాస్తవముగ మహాభారతమే శ్రీకృష్ణుని జీవన ప్రామాణిక గ్రంథము. ఇందులో శ్రీకృష్ణుని రాజనీతికోవిదునిగ, శీలవంతునిగ, సదాచారిగ, వేదవేదాంగ విదునిగ, నీతిమంతునిగ, శూరశిరోమణిగ వర్ణింపబడినది. మహాభారతములో శ్రీకృష్ణుడు జన్మాది మరణ పర్యంతము అధర్మ కార్యములు చేసినట్లు కాని, చెడు కార్యములు చేసినట్లు కాని వ్రాయబడలేదు.

## వంశ చరిత్ర

యాదవ వంశమునకు మూలపురుషుడు యయాతి. ఈయనకు యదు మరియు తుర్వసులను యిరువురు పుత్రులుండెడివారు. యదు కుమారుడు మధు. అతని కుమారుడు సాత్వత్. సాత్వత్‌కు ఇరువురు పుత్రులు. మొదటివాడు అంధకుడు. రెండవవాడు వృష్ణి. ఈ అంధకునకే మహాభోజుడనియు పేరు గలదు. అంధక వంశములోని వాడగు కంసుడు రాజయ్యెను. ఈ విధముగ యాదవ వంశ రాజ్యము అంధక వంశ రాజుల చేతిలో నుండెడిది.

శ్రీకృష్ణుడు వృష్ణి వంశమువాడు. ఈయన తాతగారు శూరుడువృష్ణికి కుమారుడు.

భారతదేశ చరిత్రలో శ్రీకృష్ణుడొక ఉజ్వలతారగ ప్రకాశించుచుండెను. ఆయన జీవనము నధ్యయనమొనర్చిన నాతడొక అసాధారణ అనుపమ పురుషుడుగ మనకు బోధపడును. చరిత్ర చూచిన ఆయనతో సమానముగ సర్వోత్కృష్ట జీవనమును గడపిన వారెవరును కానరారు. బాల్యమున వ్యాయామాదులద్వారా ఆయన తన దేహదారుఢ్యమును పెంపొందించుకొనెను. తరువాత సాందీపుని ఆశ్రమమున బ్రహ్మచర్యము పాలించుచు వేదవేదాంగముల రహస్యముల నధ్యయనము గావించెను. ఆ తరువాత మానవునకు సంపూర్ణ జీవితములో మోక్షమును ప్రసాదించునట్టిదియు, వైదిక పరంపర జీవించియుండుటకు కారణమైన ఆర్యచక్రవర్తి సామ్రాజ్యమును తన అసాధారణ బుద్ధి కుశలతతో, వేద విజ్ఞానముతో, ప్రతిభ ప్రభావములు, వ్యక్తిత్వ బలము, ధైర్యము మరియు యోగమయమైన పావన ఉజ్వల జీవనముతో సుస్థిరము గావించెను. వైదిక ధర్మాచరణముతో తన జీవితమే మహోన్నతముగ నొనర్చుకొనెను. ఆయన గొప్ప బలశాలి, మల్లయుద్ధ విశారదుడు, వంశీవాదనమున నేర్పరి, గోభక్తుడు (గోపాలుడు) ఆదర్శ శిష్యుడు మరియు ఆదర్శ పుత్రుడు, వేదశాస్త్ర పారంగతుడు, వేదానుయాయి, ధర్మజ్ఞుడు, కర్మకాండ నొనర్చువాడు, నీతికోవిదుడు, ధనుర్వేద విద్యా విశారదుడు, రాజనీతిలోని మర్మముల నెరిగినవాడు, దక్షతతో కూడిన ప్రజాపాలకుడు, యుద్ధవీరుడు, మంచి నైపుణ్యముగల రథసారథి, అసమాన పరాక్రమవంతుడు, గొప్పవక్త, వ్యవహారదక్షుడు, ఆదర్శ బ్రహ్మచారి, ఆదర్శ గృహస్థుడు, యోగిరాజు, తత్త్వజ్ఞుడు, ఆర్య మర్యాదాపాలకుడు, లోకులనందరిని ఆకర్షించువాడు, ధీరుడు, ఉదారుడు, చక్రవర్తి సామ్రాజ్య స్థాపకుడు - రక్షకుడు మరియు అకుంఠిత బుద్ధిశాలి. ఆయన ఆదర్శ జీవనము భూత భవిష్యత్

వర్తమాన కాలములలో మానవుల కత్యంత ప్రేరణ నిచ్చుచుండును గాక! శ్రీకృష్ణుని మానవాతీతునిగ, భగవంతుని అవతారముగ చివరకు భగవంతునిగ కూడ చెప్పుచు నాతనిని సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడని జనులు పిలువసాగిరి.

శ్లో ॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే ॥

శ్రేష్ఠులు ఆచరించినట్లుగనే ఇతరులు నాచరించెదరు. వారెవరిని అనుసరింతురో లోకమంతా వారినే అనుసరించుచుండును. ఇది సత్యము. ఈ యుగములో కూడ మనము శ్రీకృష్ణుని వాస్తవ జీవనము నర్థము చేసుకున్నచో నిశ్చయముగ మనమాయనను అనుకరింతుము. పైన చెప్పిన విధముగ ప్రపంచమున శ్రీకృష్ణుని గూర్చి ప్రచారమొనర్చినచో ప్రపంచముద్ధరింపబడును. మన మహా పురుషులను గూర్చి సరిగ అర్థముచేసుకొనక విపరీతముగ అర్థముచేసుకొని వారి ననుసరింపకపోవుట వలననే నేడు మనకీ దుస్థితి కలిగినది.

## ఆదర్శ మిత్రుడు

ప్రపంచమునందలి అలభ్య వస్తువులలో నిజాయితితో కూడిన మిత్రుడు కూడ ఒకడు. లోకమున విందులిచ్చువారు గాని విందులు తీసుకొనువారు గాని పరస్పరము మిత్రులుగ వ్యవహరించుచుందురు. మంచి బుద్ధిమంతులై పవిత్ర ఆదర్శములు గల విద్యార్థులు కళాశాలలో ప్రవేశించిన తరువాత అనేక దుర్వ్యసనములలో చిక్కుకొందురు. దానికి కారణము మిత్రులు. అటువంటి వారిని మిత్రులనుట కూడా సిగ్గుచేటు. వేదమాత ఇట్లు చెప్పుచున్నది - **సఖా సఖాయం వ్యతరద్ విషూచీః** ఆపదలో నున్న మిత్రుని రక్షించువాడు, విషమ పరిస్థితులలో చేయూతనిచ్చి సహాయపడువాడు మిత్రుడు. వేదమునందలి యింతటి ఉచ్చభావమునకును నేటి నికృష్ట వాతావరణమునకును పోలిక ఎక్కడ? భర్తృహరి తన నీతి శతకమున మిత్రుని లక్షణము నిట్లు చెప్పెను.

**శ్లో॥ పాపాత్ నివారయతి, యోజయతే హితాయ,**
**గుహ్యంచ నిగూహతి, గుణాన్ ప్రకటీ కరోతి ।**
**ఆపద్ గతం నజహాతి, దదాతికాలే,**
**సన్ మిత్ర లక్షణమిదం, ప్రవదంతి తద్‌జ్ఞాః ॥**

విద్వాంసులు మిత్రుని లక్షణముల నిట్లు వర్ణింతురు -

1. మిత్రుడు పాపాచరణమునుండి రక్షించును.
2. హితమును గూర్చు పనులను చేయుటకు ప్రేరేపించును.
3. రహస్యముగ నుంచదగు స్వవిషయములను రహస్యముగ నుంచును.
4. మిత్రుని మంచి గుణములను అన్నివేళలా అందరితో చెప్పుచుండును.
5. ఆపదలో నున్న మిత్రునెన్నడు ఒంటరిగా విడిచిపెట్టక సమయానుకూలముగ సహాయము చేయును.
6. సమయానుకూలముగ సహాయపడును.

ధనము, ఐశ్వర్యము, ఉన్నతపదవి, గౌరవములుగల ఒక మిత్రునివద్ద కొకనాడొకవ్యక్తి వెళ్ళగా ఆ మిత్రుడతనిని మీరెక్కడి నుండి వచ్చితిరి? ఏమి పనిమీద వచ్చిరని యడిగెనట. అందులకా వ్యక్తి కోపము నణచుకొనుచు నన్ను నీవొకప్పుడు మిత్రునిగ చూచుచుండెడివాడవు. అందరూ నీకు సరిగా కనబడుటలేదని అనుకుంటుంటే చూచి పోదామని వచ్చాను. కాని నిన్ను చూస్తుంటే నీవు పూర్తిగా అంధుడవైనావు అనెనట!

"సమాన వ్యసనేషు సఖ్యమ్" -

సమాన గుణకర్మస్వభావములు గల వ్యక్తులమధ్య స్నేహము పొసగుననునది లోకోక్తి. కాని శ్రీకృష్ణ సుదాముల స్నేహము జగత్ప్రసిద్ధమైనది. తన చిన్ననాటి బాల్యస్నేహితుడు, సహాధ్యాయి, నిరుపేదయైన సుదాముడు అత్యంత దయనీయ స్థితిలో శ్రీకృష్ణుని గృహమును సందర్శించినపుడు శ్రీకృష్ణుడొనర్చిన సత్కారము ప్రపంచ చరిత్రలోనే అనన్య సామాన్యము.

ఒకనాడు ద్వారకలోని రాజభవన ద్వారమందొక భిక్షకుడు నిలచియుండెను. శిరస్సుపై పాగా, శరీరముపై చొక్కాలేక, మాసి చిరిగిన ధోవతిని ధరించి, కాళ్ళకు చెప్పులు కూడా లేకుండ దరిద్రావస్థలోనున్న నొక వ్యక్తి ఆశ్చర్యముగ ఆ సుందరభవనమును చూచుచుండెను. అతనింటిలో దరిద్రము తాండవించు చున్నందున, పిల్లలకు భోజనము దొరుకుట కూడా కష్టమైనందున, అతని భార్యపంపగా యిచ్చటకు వచ్చెను. గృహిణి తాను దుఃఖమును సహింపగలుగును కాని, తన సంతానము దుఃఖము ననుభవించుట సహించజాలదు. పర్వతమువంటి ప్రతాపవంతుడు రాణా ప్రతాపసింహుడు కూడ తన సంతానము ఆకలితోనున్న చూచి చలించిపోయిన, పాపమా స్త్రీ ఎంతటిది? ఒకరోజున మాటలలో ఆ దరిద్ర బ్రాహ్మణుడు తన భార్యతో బాల్యమిత్రుడు శ్రీకృష్ణుని గూర్చి చెప్పెను. అంతట

ప్రతిరోజు ఆమె తన మిత్రుడు కృష్ణుని వద్దకు వెళ్ళి సహాయమును తీసుకొని రమ్మని బాధింపసాగినది. అతడు తప్పించుకు తిరుగుచుండెడివాడు. కృష్ణుడు తనను అవమానమొనర్చి పంపినచో జీవితమంతా సంపాదించిన తన గౌరవము ఒక్కక్షణములో నష్టమైపోవును. తన జీవితములో కేవలము గౌరవరూప ధనమునే సంచయమొనర్చెను. తనవద్ద యెట్టి సంపదలు లేకున్నను తనముందు ప్రజలు గౌరవముతో తలవంచెదరు. ఇంతకాలము ఎవరికి తలవంచని తా నీనాడు పొట్టకూటికొఱకు కృష్ణునిముందు తలవంచవలయునా? తలవంచినా దానికి తగిన మూల్యమును అతడిచ్చునో లేదో, నమ్మకములేని ఈ పనికై ఎంతోదూరము ప్రయాణము చేసి ఎవరు వెళ్ళుదురు? కృష్ణుడు తన నుపేక్షించినచో తాను సహింపగలడా? ద్వారకకు ఎట్టి పరిస్థితులలోనైనా తను వెళ్ళరాదని నిశ్చయించుకొనెను. కాని విద్వాంసురాలైన పత్ని ఆయనకు నచ్చజెప్పుచు 'బ్రాహ్మణుడు అవమానమును కూడ అమృతముతో సమానముగ తలంపవలయును. మీరు కృష్ణునేమియు యాచింపవద్దు. ఆయనేమైనా యిచ్చినా తీసుకొనవలదు. కేవలము ఆయననొకసారి కలిసిరండి. పరమప్రియమిత్రుని కలుసుకొనుటకు కూడ వెళ్ళనటువంటి మీ హృదయమెంత కఠోరము. నా స్నేహితురాళ్ళెల్లప్పుడు నాకు గుర్తుండెదరు. వారిని చూడవలయునని నాకు ఎల్లప్పుడు కోరికయుండును!" అన్న భార్యమాటలు బాణమువలె సుదాముని హృదయమున గ్రుచ్చుకొని మైత్రితోకూడిన అతని హృదయములో శ్రీకృష్ణుని చూడవలయునను కోరిక బాలుని చందమున పరవళ్ళు త్రొక్కసాగినది. చూచి చాలారోజులైనది. కనుక ఒకసారిపోయి చూచివచ్చెదను. ప్రేమాదరములు లభింపకున్నను కనీసము మిత్రుని దర్శనమగునని తలంచి ఆ దరిద్ర బ్రాహ్మణుడు అనేక కష్టములకోర్చి ద్వారకకు చేరుకొనెను. ద్వారకలోని రాజసభా భవనమునకు ముందు సుదాముడు నిలబడియుండెను. మనస్సులో అనేక సందేహములు కలుగసాగినవి. శ్రీకృష్ణుని కలువవలయునని ద్వారపాలకునితో చెప్పుదమా అంటే ఆయన తన రాచకార్యములలో రాజభోగములతో తలమునకలగుచుండునేమో యను సందేహము కలుగసాగెను. ఆయనకు నన్ను కలుసుకొనుటకు తీరికయుండునా? అతడు భ్రమణము కొరకెప్పుడైనా బయటకు వచ్చినచో దూరమునుండి దర్శనమొనర్చుకుందును అని తనలో అనుకొనుచుండెను. అట్లయినచో ఆయన ఎప్పుడు బయటికి వచ్చునో? అంతవరకు బయటనే వేచియుండిన చాలా సమయము వ్యర్థముగావచ్చును. ఏ ద్వారముగుండా

బయటికి పోవునో ఎట్లు తెలియును? రాజసభాభవనమునకు నలువైపుల ద్వారము లున్నవి. కనుక ద్వారపాలకుల ద్వారా కబురంపెదను. ఇష్టపడి అతడే కలుసుకొనుటకు వచ్చినచో కలిసెదను. లేనిచో తిరిగి గ్రామమునకు పోవుదును. శ్రీకృష్ణుడు సుఖముగ నున్నట్లు చూచితిని. ఇదేమైనా తక్కువ సంతోష వార్తయా? ఇట్లు ఊహాలోకమున విహరించుచు చాలసేపటి నుండి ద్వారమున కెదురుగా నిలిచియున్న ఆయనను చూచిన ద్వారపాలకుడు యాచకుడని తలంచి అయ్యా! మరల ఎప్పుడైనా రండి. మా మహారాజుగారిప్పుడు రాచకార్యములలో మునిగియున్నారు. ఇది దానమునకు సమయము కాదు అనెను. ద్వారపాలకుని మాటలను వినిన సుదామునకు ధైర్యము వచ్చినది. అతడు ద్వారపాలకునితో ధైర్యముగ - 'నేను భిక్షగాని, దానము గాని అడుగుటకు రాలేదు. శ్రీకృష్ణుడు నా బాల్యమిత్రుడు. అందువలన ఆయనను కలుసుకొనుటకు వచ్చితి' ననెను. ఆ ద్వారపాలకు డతనిని ఆపాదమస్తకము చూచి మహారాజును కలియుటకు తగిన ఆభూషణాదులను అతడు ధరింపకున్నను అతని ముఖములోనున్న అచంచల విశ్వాసమును చూచి భయముతో - ఈ వ్యక్తి తరువాత మహారాజును కలిసినప్పుడు నేను నీ మిత్రుడనని ఎంత చెప్పినను నీతో కలియుటకు అనుమతి నివ్వలేదని చెప్పినచో, మహారాజు కోపము చెందును. అని ఆలోచించి ఆ ద్వారపాలకుడు వెంటనే శ్రీకృష్ణుని వద్దకు వెళ్ళి, మహారాజా! ద్వారము వద్ద ఒక దరిద్రుడు, బలహీనుడైన వ్యక్తి ఉన్నాడు. అతని పేరు సుదాముడట. మిమ్ములను కలుసుకొనగోరుచున్నాడు. లోపలికి పంపమందురా? యని అడిగెను. ఆశ్చర్యము! 'సుదాము'డను మూడక్షరములలో నేమి మాయయున్నదో కాని ద్వారపాలకుని కంటె ముందుగనే పాదరక్షలు కూడ ధరింపకుండా ద్వారకాధీశుడు త్వరత్వరగా బయటకు వెడలెను. ద్వారపాలకుడు బయటికి వచ్చి చూడగా మహారాజు శ్రీకృష్ణుడా దీనవదనుని కౌగిలించుకొని దుఃఖింపసాగెను.

మధ్యమధ్యలో శ్రీకృష్ణుడు సుదామునితో - ఇంతటి కష్టములలో నుండి కూడ నాకు తెలియజేయకుండుటకు కారణమేమి? మీకు నాపై విశ్వాసము లేదా? గురుకులమున యిరువురము కలిసి విద్యాభ్యాసమొనర్చుచు, గురుసేవ చేయుచుండినట్టి ఆనాటి ప్రాతస్నేహితుడను కానా? నేను. రాచకార్యములలోపడి తన బాల్యమిత్రునిగూడ మరచినటువంటి నే నపరాధిని. నన్ను క్షమింతురా సుదామా? అనుచుండగా, దీనునివలె కనబడుచున్నట్టి ఆ దరిద్ర బ్రాహ్మణుడు తనకు జరుగుచున్న

గౌరవమును ఇంద్రభోగమువలె తలంచుచు తన దరిద్రస్థితిని పూర్తిగా మరచెను. తలపాగాలేని శిరస్సు, పాదరక్షలులేని కాళ్ళు, అంగవస్త్రములేని శరీరము, చిరిగిన ధోతి అన్నింటిని మరచెను. నరేంద్రుడైన కృష్ణుడాతనిని సింహాసనముపై కూర్చుండబెట్టి పాదములను కడుగుచుండగా, రాణి రుక్మిణి జలమును పోయుచున్నది. ముళ్ళతో పగుళ్ళతోనున్న ఆ పాదములపై జలముతో పాటు బాల్యమిత్రుడు శ్రీకృష్ణుని కంటినుండి అశ్రువులుకూడ రాలుచున్నవి. తదుపరి అహర్నిశములు రాచ కార్యములలో మునిగియుండు కృష్ణుడు గంటలకొలది తనమిత్రునితో కలసి రాచకార్యములకంటె కూడ ముఖ్యమైన విషయములైనట్లుగ మాట్లాడుచుండుట చూచి రాణీ, రాజ్యాధికారులు అశ్చర్యమును జెందుచుండిరి. ఇరువురి నవ్వులతో రాజుయొక్క అతిథిగృహము ప్రతిధ్వనించుచుండెను. తాను ప్రపంచమునందలి దుఃఖద్వంద్వములనుండి దూరముగ, కష్టములులేని, స్వాభిమానమునకు లోటు లేని, ఒక స్థలవిశేషమునకు వచ్చినట్లు సుదామునకు తోచెను. అతడు ఇంటికి తిరిగివచ్చుసరికి ఆయన కత్యంత అశ్చర్యము గొలుపునటుల తన కుటీరముండెడి స్థానములో ద్వారకలోని రాజభవనమును మించిన సుందర భవంతి యుండెను. వస్త్రాభరణములతో అలంకృతయైన భార్య సుదామునకెదురువచ్చి పాదములనంటి వందనము చేయుచు శ్రీకృష్ణుని ప్రశంసించుచు జరిగిన విషయమును తెలిపెను. శ్రీకృష్ణుని ఆదర్శ స్నేహమునకు యిదొక ఉదాహరణ. మరొకటి -

తన ప్రియపుత్రుడు అభిమన్యుని క్షాత్ర ధర్మమునకు విరుద్ధముగ వధించిన జయద్రథుని మరునాడు సూర్యాస్తమయమగులోపున వధింతునని అర్జునుడు అత్యంత ఆవేశముతో ప్రతిజ్ఞ నొనర్చెను. కాని అదంత సులభసాధ్యమైన పనికాదు. దుర్యోధనుడు జయద్రథుని రహస్యముగ దాచియుంచి పూర్తిరక్షణ కల్పించెను. అయినప్పటికి తన మిత్రుని ప్రతిజ్ఞను నెరవేర్చుటకై యథాశక్తి తాను సహాయ మొనర్చుటకు మాటయిచ్చుచు శ్రీకృష్ణుడిట్లనెను.

శ్లో॥ నహిదారా, న మిత్రాణి, జ్ఞాతయో న చ బాన్ధవాః ।
కశ్చిదన్యః ప్రియతరః, కుంతీ పుత్రా న్మమార్జునాత్ ॥

(మహా. ద్రోణపర్వం 79వ అధ్యాయం)

అర్థము : కుంతీ పుత్రుడైన అర్జునుడు నాకు నా పత్నీ, మిత్రులు కుటుంబములోని బంధుజనులు, సోదరులకంటె అధిక స్నేహితుడు అనెను.

ఇదేవిధముగ ఒకనాడు భీష్మునితో యుద్ధము జేయుచున్న పాండవ సైన్యములో ఆయనధాటి కాగలేక హాహాకారములు చెలరేగినవి. అత్యంత కలతచెందియున్న ధర్మరాజు యుధిష్ఠిరుని చూచి శ్రీకృష్ణుడు ఆయనతో అనునయ వాక్యములు పలుకుచు, భీష్మునితో అర్జునుడు యుద్ధము చేయజాలకపోయినచోనేనే స్వయముగా యుద్ధము చేసి భీష్ముని తప్పక ఓడింతుననెను. ఏలయన అర్జునుని నా మిత్రునిగ చేసుకుంటిని. మిత్రునకు సహాయ మొనర్చుట నా పరమ ధర్మము అనుచు ధర్మరాజుతో శ్రీకృష్ణుడిట్లనెను.

**శ్లో॥ తవ భ్రాతా మమ సఖా, సంబంధీ శిష్య ఏవచ ।**
**మాంసాన్యుత్కృత్య దాస్యామి ఫల్గుణార్థే మహీపతే ॥**

**(మహా. భీష్మ పర్వం - 107 అధ్యాయం)**

అర్థము : ధర్మరాజా! నీ సోదరుడైన అర్జునుడు నా స్నేహితుడు, బంధువు, శిష్యుడు. అతని కొరకు నా శరీర మాంసమును కూడ కోసియిత్తుననెను. శ్రీకృష్ణుడు యుద్ధములో 'నేను అస్త్రములను ధరింపనని' ప్రతిజ్ఞ చేసినప్పటికిని భీష్మునితో యుద్ధము చేయుచున్నప్పుడు అర్జునుని పక్షము ఓడిపోవుచుండుటను చూచి, సుదర్శన చక్రమును ధరించి 'ప్రీతిం కరిష్యామి ధనంజయస్య' అనుచు భీష్ముని వధించుటకై సిద్ధమగుచుండగ అర్జునుడు శ్రీకృష్ణుని ప్రతిజ్ఞను జ్ఞాపకము చేయుచు అడ్డుపడెను.

అట్లే మరొకసారి పాండవులు వనవాసములో నుండగా వారిని కలియుటకై శ్రీకృష్ణుడు వెళ్ళినప్పుడాయనతో ద్రౌపది తమకు జరిగిన అవమానమును తమ దుఃఖములను గూర్చి చెప్పగా శ్రీకృష్ణుడు అర్జునుని ఓదార్చుచు యిట్లనెను.

**శ్లో॥ మమైవ త్వం తవైవాహం, యే మదీయా స్తవైవతే ।**
**యస్త్వాం ద్వేష్టి స మాం ద్వేష్టి, యస్త్వామను సమామను॥**

**(మహా. వనపర్వం 12-45)**

అర్థము : ఓ అర్జునా! నేను నీ మిత్రునగుట వలన సుఖదుఃఖములన్నింటిలో నీకు నేను తోడుగ నుందును. నీవు నావాడవు,నేను నీ వాడను. నీ శత్రువు నాకును శత్రువే. నీ మిత్రుడు నాకును మిత్రుడే.

**శ్లో॥ అనన్యః పార్థ మత్తస్త్వం త్వత్తశ్చాహం తథైవ చ।**

ఓ అర్జునా! నీవు నేను ఇరువురమొక్కటే. స్నేహితుని కష్టసమయములో

కష్టములను, సుఖ సమయములో సుఖములను పంచుకొనుటయే మిత్రత్వములోని సర్వోత్కృష్టమైన పరమోత్తమ గుణము.

ఈ విధముగ శ్రీకృష్ణుని ఆదర్శ మిత్రత్వము మహాభారతమున అనన్య సామాన్యముగ గోచరించును.

## శ్రీకృష్ణుడు శాంతి ప్రియుడు

ప్రజలు సాధారణముగ శ్రీకృష్ణుని యుద్ధప్రియుడు, ఇతరులతో పోరాడు స్వభావము కలవానినిగ తలంచుచుందురు. దీనికి భగవద్గీతలోని ప్రథమాధ్యాయమును వారు ఆధారముగ చెప్పుచుందురు. కురుక్షేత్రములో యుద్ధభూమి కిరువైపులా సేనలు నిలబడియుండగా అర్జునుడు తన బాంధవులను జూచి యుద్ధము జేయుటకు మనస్సొప్పక విరక్తుడై నేను చివరకు బిచ్చమెత్తుకొనియైనా జీవింతునుగాని నా బంధువులను రాజ్యము కొరకు చంపననెను. శ్రీకృష్ణుడు అర్జునుని ఈ మాటల కాశ్చర్యము జెందును. దేనికొరకు నేటివరకు పాండవులు దృఢనిశ్చయముతో ప్రయత్నించుచుండిరో ఆ సమయమాసన్నమైనపుడు అర్జునుడు యుద్ధము చేయననుటకు కారణము నిశ్చయముగ మిథ్యావ్యామోహమే. అర్జునుని ఈ మోహమును గీతలోని రెండవ అధ్యాయములో ప్రారంభమున గల కొన్ని శ్లోకములతోనే శ్రీకృష్ణుడు దూరమొనర్చెను. అర్జునునకు కలిగిన ఈ మిథ్యావ్యామోహమును దూరమొనర్చుటే శ్రీకృష్ణుని ఉపదేశము యొక్క ముఖ్యోద్దేశ్యము.

పాండవులు చాలముందుగనే యుద్ధమునకు సన్నాహములు జేయుచుండిరి. అర్జునునకు యుద్ధము జేయుట కిష్టము లేనిచో అప్పటివరకు మాట్లాడకుండా ఎందుకున్నట్లు? ఇరుపక్షముల వారు యుద్ధమునకు సిద్ధముగనున్న సమయమున యుద్ధభూమినుండి మరలిపోవుదుననుట క్షత్రియున కపకీర్తిని కల్గించునట్టిదియు మరియు సిగ్గుచేటుగ శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పి అతనిని యుద్ధము చేయుటకు ప్రేరేపించెను. కనుక గీతలో ప్రథమాధ్యాయమును బట్టి చూచిన వాస్తవముగ అర్జునుడు యుద్ధము చేయుటకంగీకరింపకున్నను శ్రీకృష్ణుడే అతనిని యుద్ధమునకు ప్రేరేపించెననుట అసత్యము.

శ్రీకృష్ణుని జీవనము నందలి అనేక ఇతర ప్రసంగములను జూచినచో పరస్పరము అన్నదమ్ముల మధ్య యుద్ధమును ఏదోవిధముగ నివారించుటకాయనెంతో ప్రయత్నించినట్లు స్పష్టమగును. దుర్యోధనుని బలము అతని

మిత్రులపై ఆధారపడియుండెను. కనుక యుద్ధములో దుర్యోధనుని మిత్రులను ముందుగ వధించినచో దుర్యోధనుడు బహుశః యుద్ధము చేయుట మానుకొన వచ్చునని శ్రీకృష్ణుడు తలంచెను. మున్ముందుగ మగధరాజు జరాసంధునిపై శ్రీకృష్ణుని దృష్టిపడినది. ఆ రోజులలో నాతడు ప్రతాప సాహసములతో కూడి శక్తివంతునిగ పరిగణింపబడుచుండెను. దుర్యోధనుని మిత్రులలో నాతడు ముఖ్యుడు. సంక్షిప్తముగ జెప్పవలయుననిన ఏదో వివాదమును రేకెత్తించి భీముని సహాయముతో శ్రీకృష్ణుడు జరాసంధుని వధించెను. చేది దేశపు రాజైన శిశుపాలుడు తన రెండవ లక్ష్యము. రాజసూయయాగము జరుగుచున్న సమయమున సాధారణ ప్రసంగ వశమున తనను నిందించుచున్న శిశుపాలుని శిరస్సును సుదర్శన చక్రముతో ఛేదించెను. పై సంఘటనల మూలముగ నిందలను భరింపవలసి వచ్చినను శ్రీకృష్ణుడు లెక్కజేయక కేవలము దుర్యోధనునకు సహకారమొనర్చు వారిని అంతమొందించుట ద్వారా యుద్ధము నాపుట కాశించుచుండెను.

చివరకు యుద్ధము నిలిచిపోవు పరిస్థితులు కనుపింపనందున మరొక సారి దుర్యోధనునితో కలసి యుద్ధము జరుగకుండ ఇరుపక్షములకు సంతోషదాయకమైన ఉపాయము నాలోచించుటకై శ్రీకృష్ణుడు హస్తినాపురమున కేగెను. నిండు సభలో ప్రతియొక్క చిన్న విషయముపై దుర్యోధనునితో చర్చించెను. దానికెట్టి విధమైన సమాధానము రానందున శ్రీకృష్ణుడు చివరకు దుర్యోధనునితో - 'మీరు చక్రవర్తులు. రాజ్యపాలనాధికారము మీ చేతులలో నున్నది. పాండవులు ఉచిత రీతిలో జీవనమును గడుపుటకై హస్తినాపురమునకు చుట్టుపట్లగల గ్రామములలో ఏవైనా ఐదు గ్రామములు వారికివ్వమని' యడిగెను. దానికి సమాధానముగ దుర్యోధనుడు -'మీరు ఐదు గ్రామముల నడుగుచున్నారు! కాని సూదిమొన మోపినంత భూమినికూడా నేను పాండవులకు యుద్ధము చేయకుండా యిచ్చుటకు సిద్ధముగా లేననెను.'

అప్పుడు దుర్యోధనుడు శ్రీకృష్ణుని బందీని చేయుటకై ఆలోచించుచున్నట్లు కూడ చెప్పుదురు. 'ఇతడు యుద్ధము వలదని తిరుగుచున్నాడు. యుద్ధము సమాప్తమొందువరకు ఇతనినొక బందీగృహమున నుంచవలయునని' తలంచు చుండగా వీరుడు సాత్యకి ఈ రహస్య మంతనములను పసిగట్టి వారి పన్నాగమును భగ్నము చేసి ఆ సభలోనే యిట్లు ప్రకటించెను. 'ఓ సభికులారా! బాలురు, మందబుద్ధిగలవారు మండుచున్న అగ్నిని వస్త్రముతో బంధించుటకు ఎట్లు యత్నింతురో అట్లే కొందరు బుద్ధిహీనులైన కౌరవులు ఈ కమలనయనుడైన

శ్రీకృష్ణుని బందీగ చేయుటకు ఆలోచించుచున్నారు.' అనెను.

ఇట్టి పాపముతో కూడిన రహస్య మంతనములు బయటపడినపుడు దూరదృష్టిగల విదురుడు శ్రీకృష్ణుని వీరత్వము, దృఢసంకల్పములను గూర్చి వర్ణించుచు అనిన మాటలు - 'ఓ ధృతరాష్ట్ర! నీవు శ్రీకృష్ణుని ఉత్తమ చరిత్రను తెలుసుకొనలేదు. నీ పుత్రుడు దుర్యోధనుడు శ్రీకృష్ణుని ఖైదీగ చేయుటకు పన్నిన పన్నాగము ఆయననుగూర్చి తెలియక చేసినట్టిది. ఈ విధముగా భయపెట్టి శ్రీకృష్ణుని ధర్మమార్గమునుండి తప్పింపలేము. పురుషోత్తముడైన శ్రీకృష్ణుడు ఎట్టి నిందిత పాపకర్మలను చేయడు. ధర్మమార్గము నుండి వెనుకంజవేయడు.'

ఈ యుద్ధముతో తనకెట్టి సంబంధము లేకుండయుండుట మంచిదని శ్రీకృష్ణుడు తలంచుచుండెను. ఒకనాడు దుర్యోధనుడు, అర్జునుడు ఇరువురు తనను కలుసుకొనుటకు వచ్చుచున్నట్లు నాతనికి వార్త అందినది. ఆ రాత్రి వారికి తగినచోట విశ్రాంతికొరకేర్పాట్లు జేయించెను. మరునాడు ప్రాతఃకాలముననే లేచి దుర్యోధనుడు శ్రీకృష్ణుని కలుసుకొనుటకు వచ్చెను. అతని నెవరూ అడ్డగింపలేదు. శ్రీకృష్ణుడు నిద్రించుచుండెనని తెలుపగా శ్రీకృష్ణుని శయన మందిరమున ప్రవేశించి మెల్లగా ఆసనము నొకదానిని లాగుకొని శ్రీకృష్ణుని శిరస్సువైపు కూర్చుండి శ్రీకృష్ణుడు లేచు సమయముకొరకు చూచుచుండెను. కొంతసేపటికి అర్జునుడు కూడ అచ్చటికి వచ్చెను. తనకంటె ముందుగనే పెద్దన్నగారు వచ్చి కూర్చుండుట చూచి తానుకూడ ఒక ఆసనమును లాగుకొని కృష్ణుని కాళ్ళవైపుగ కూర్చుండెను. లేచి కూర్చున్నప్పుడు దుర్యోధనుని వైపు వీపు, అర్జునుని వైపు ముఖముండుట సహజమే. వెంటనే అర్జునునితో యింత ప్రొద్దుండగనే రాకకు కారణమేమని యడిగెను. యుద్ధములో మీరు మాకు సహాయము చేయవలయునని అర్జునుడు తన ఉద్దేశ్యమును తెలిపెను. అదే సమయమున 'నేను అర్జునునికంటె ముందుగ వచ్చితిని కనుక నాకు ముందు అడుగు అధికారమున్నది' అని వెనుకనుండి మాటలు వినబడినవి. కృష్ణుడు వెనుకకు తిరిగిచూచెను. అర్జుననకు సహాయమొనర్చుటకు మాటయిచ్చితిని. ఇప్పుడేమి చేయవలయునని ఆయన సందిగ్ధావస్థలో పడి, తక్షణమే ఆలోచించి ఆయన దుర్యోధనునితో ఒకవైపు నేను, మరొకవైపు నా సమస్త యాదవ సైన్యము ఉందుము. ఈ రెంటిలో మీకెవరు కావలయునని యడిగెను. దుర్యోధనుడు యాదవ సైన్యము కావలయునని కోరుకొనెను. అప్పుడే చివరిగ శ్రీకృష్ణుడు 'నేను ఈ యుద్ధమును ఏదోవిధముగ

అపుటకు ప్రయత్నించుచు వచ్చుచుంటిని. కాని అది సఫలము కాలేదు. ఇప్పటికిని యుద్ధరూపములో నా సహాయముండరాదని నా ఉద్దేశ్యము. కనుక యుద్ధములో నేను శస్త్రములను ధరింపను. అటువంటప్పుడు నేను వానిని ప్రయోగించు ప్రశ్నే యుండదు' అనును.

పాండవుల వనవాసము పూర్తికాగనే ధృతరాష్ట్రుడు పాండవుల వద్దకు సంజయుని పంపెను. ప్రథమమున సంజయుడు యుధిష్ఠిరునితో కొంతసేపు మాట్లాడిన పిదప శ్రీకృష్ణుని వైపు చూపుచు - ఇరుపక్షముల మేలుకోరువాడు శ్రీకృష్ణుడు. కనుక, ఈ విషయములో ముందుగ ఆయన అభిప్రాయమును తెలుసుకొనవలయుననెను.

అప్పుడు శ్రీకృష్ణుడు సంజయునితో "హే సూత! ఇరుపక్షముల వారు శాంతితో నుండవలయుననునదే నా అభిలాష అని, తదుపరి యుధిష్ఠిరునితో ఓ కుంతీనందన! నీవు కౌరవులతో సంధిచేసుకొనుము. వారితో శాంతి భావముతో మెలుగుము. ఇంతకంటె వేరొక మాట ఏదియు చెప్పను" అనెను.

శ్రీకృష్ణుడు తన హృదయములోని మాటను స్పష్టపరచుచు తిరిగి సంజయునితో యిట్లనెను. 'ఓ సంజయ! పాండవులకు ధర్మానుసారముగ లభింపవలసిన రాజ్యభాగము నష్టము కాకుండా కౌరవులతో పాండవులకు నేను సంధికుదర్చగలిగినచో ఈ పరమ పవిత్రము మహా అభ్యుదయమైన కార్యము నా ద్వారా జరిగినందులకు నేనెంతో ఆనందింతును. అంతేగాక కౌరవులు మృత్యువాత నుండి తప్పించుకొనగలుగుదురు.'

మరొకసారి శ్రీకృష్ణుడు దూతరూపముతో వెళ్ళుటకు కారణమును తెలుపుచు యుధిష్ఠిరునితో నిట్లనును. 'హే! యుధిష్ఠిర! నీ కేనష్టమును కలుగనీయకుండా కౌరవులవద్దకు వెళ్ళి నేను ఇరుపక్షములకు సంధిని చేకూర్చగలిగినచో నా ద్వారా ఒక మహత్కార్యము గొప్ప పుణ్యకార్యము జరిగినట్లుగ తలంతును.'

'ధృతరాష్ట్రుని పుత్రుడు దుర్యోధనుడు డెంతటి పాపియో నాకు తెలుసు. ఐనా కౌరవులవద్దకు దూత రూపములో పోవుటకు కారణమేమన - ఇరుపక్షములలో సంధికుదిరినచో ప్రపంచమునందలి క్షత్రియుల దృష్టిలో మనము నిందకు పాత్రులము గాకుందుము.'

దూతగ కౌరవ సభలో శ్రీకృష్ణుని సంభాషణయొక్క సారంశ మిట్లుండెను. " ఓ ధృతరాష్ట్రా! క్షత్రియవీరుల మారణహోమము కాకుండగనే కౌరవపాండవుల

మధ్య శాంతిని నెలకొల్పగలమని మీతో ప్రార్థించుటకై వచ్చితిని. ఈ సమయమున సమస్త క్షత్రియ వంశములలో కురువంశమే సర్వశ్రేష్ఠమైనది. కనుక మీ వలన అధర్మ కార్యమేదియు జరుగుట మంచిదికాదు".

"ఓ కురుశ్రేష్ఠా! కౌరవులపై యిప్పుడతి భయంకర ఆపద వచ్చి పడినది. ఇప్పుడు కూడ ఉపేక్షించినచో సమస్త భూమండలము ధ్వంసమగును. భారత! మీరు తలచుకొన్నచో ఈ భయానక ఆపదను దూరమొనర్చగలరు. ఇరుపక్షములను సమాధానపరచి సంధిజేయుట కష్టమైన పనేమీకాదు. ఇరుపక్షముల వారిని సంధియొనర్చుపని మీ, నాయొక్క ఆధీనములోనున్నది. మీరు మీ పుత్రులనదుపులో నుంచుడు. నేను పాండవులను ఒప్పింతును. ఈ యుద్ధమువలన పరిణామమును కూడ ఆలోచించుడు. నాకు ఈ యుద్ధములో ఇరుపక్షములవారి వినాశము కనబడుతున్నది. ఓ కురుశ్రేష్ఠ! సమస్త క్షత్రియవీరుల, ప్రజల నాశనమును నివారించు ఉపాయము నాలోచింపుడు. మీరు వయోవృద్ధులు. పాండవులకు మీపై పూర్వపు స్నేహభావమట్లే చెక్కుచెదరక యున్నది. తండ్రిలేని ఈ పాండవులను చిన్ననాటినుండి మీరే పోషించి పెద్దచేసిరి. ఇప్పుడు కూడ న్యాయముగ వచ్చు వారి భాగమును వారికిచ్చి శాంతిని కలుగ జేయుటకు సహాయపడుడు. పాండవులు మిమ్ములను పెదతండ్రిగ భావింతురు. అందువలననే ప్రతిజ్ఞచేసిన ప్రకారమువారు 12 సం॥లు అరణ్యావాసము, ఒక సం॥ర మజ్ఞాత వాసమును కూడా గడిపిరి. మీరు కూడా మీ మాటపై నుండి వారి రాజ్యభాగమును వారికిప్పించుడు. శిష్యులను చెడుమార్గము నుండి ఆచార్యుడు నిరోధించినట్లే తండ్రి పిల్లలనుకూడ నిరోధించును. మీరు ధర్మాత్ములు, న్యాయమును పాలించు రాజులు. అట్టి మీ సమక్షమున నేదైనా అన్యాయము జరిగినచో మీ కగౌరవము కలుగును. ఓ భారత! నేను మీయొక్క, పాండవుల యొక్క శ్రేయస్సును గోరుదును. మీరు ప్రజలను ధర్మార్థ సుఖముల నుండి వంచితులను చేయవలదు" అనును. ఈ ఉపదేశమంతా మహాభారతమందలి ఉద్యోగపర్వములోని 96వ అధ్యాయములో నున్నది. దానినీ క్రింది శబ్దములతో తన చివరికోరికగా ప్రకటించుచు శ్రీకృష్ణుడు - 'అహంతు తవ తేషాంచ శ్రేయ మిచ్ఛామి భారత!' అనును. తరువాత ధృతరాష్ట్రుని ప్రార్థనపై దుర్యోధనునకు శ్రీకృష్ణుడిట్లు బోధించెను.

'ఓ దుర్యోధన! నేను శుభసంకల్పముతోనే దూతగ ఇచ్చటకు వచ్చితిని. నీ వొక క్షత్రియ వంశమున నుద్భవించితివి. కాని నీవు చేయుచున్నట్టి ఈ కార్యము

నీకు తగినట్లుగలేదు. ఇటువంటి నికృష్ట కర్మలు నీచకులమున పుట్టిన పామరులే చేయుదురు. 'హే భరత శ్రేష్ఠ! నీవు శూర,వీర, మనస్వీ జ్ఞానివి నగుటవలన నీ మంచి చెడులన్నియు నీవే ఆలోచింపవలయును. నీ శ్రేయస్సుగోరు విదురుని, భీష్మ పితామహుని, తండ్రి ధృతరాష్ట్రుని మాటలను వినవలయును. నీవు దురాగ్రహమును వదలి పాండవులతో సంధి కుదుర్చుకున్నచో ఒక మహత్తర విపత్తునుండి తప్పించుకొనవచ్చును. లేనిచో తరువాత పశ్చాత్తాపము చెందినను ఫలముండదు.'

'ఓ భరత శ్రేష్ఠ! నీ కిప్పుడు సలహాల నిచ్చుచున్నవారు నీ హితమును కోరువారు కారు. నీవు వీరులు, ధర్మాత్ములైన పాండవులతో నెల్లప్పుడు కుటిల వ్యవహారము నొనర్చితివి. కాని ఎవరు ధర్మాత్ములైన పురుషులతో సత్ప్రవర్తన చేయరో వారు గొడ్డలి వనమును నరకిన చందమున తమను తామే ఛేదించుకొని నాశనము చెందుదురు. నీవు పాండవులతో సంధి యొనర్చుకొన్నచో నీ మనోరథము లన్నియు నీడేరును.'

'ఓ భరతనందన! పాండవులు నీ కంటె బలహీనులు కారనుమాటకూడ నీవు తప్పక జ్ఞాపకముంచు కొనవలయును. ఓటమి చెందుదుమను భయముతోనే పాండవులు సంధికై యత్నించుచున్నారను కొనుచున్నావేమో నీవద్దనున్న యోధులందరికి సమాధానము చెప్పుటకై ఒక్క అర్జునుడు చాలును. విరటుని నగరములో భీష్మాదులను అర్జునుడు పరాభవించిన సంగతిని కొంచెముకూడా జ్ఞప్తికితెచ్చుకోవా? నేను అర్జునుని సారథిని. నేను సారథ్యము వహించుచుండగా అర్జునుని ఎవరైనా ఓడింపగలరా? కనుక పూర్వాపరముల నాలోచించుకొని భయంకర యుద్ధమున నరసంహారమునకు కారకుడవు గాకుము.'

**శ్లో॥ అస్తుశేషం కౌరవాణాం మాపరా భూదిదం కులమ్ ।**
**కులఘ్న ఇతి నోచ్యేథా నష్టకీర్తి ర్న రాధిప ॥ (మహా. ఉద్యోగ. 124 అ)**

"హే! నరేశ్వర, కౌరవ వంశము రక్షింపబడుగాక! దీనికి పరాభవము కాకుండును గాక! నీ కీర్తిని నాశనమొనర్చుకొని నీవుకూడా కులఘాతకుడవని పించుకొనకుము. పాండవులతో సంధిచేసుకొన్నట్లయితే ధర్మాత్ములైన వారు నిన్నే యువరాజుగా యుంచెదరనుట నిశ్చయము. నామాట విను. నీ యింటికి వచ్చిన రాజ్యలక్ష్మిని అవమానమొనర్పక పాండవుల కర్ధరాజ్యము నిచ్చి రాజ్యభోగముల ననుభవింపు మని' బోధించెను.

ధృతరాష్ట్రునకు విదురుని సలహా :

'ఓ కురురాజా! నీ విప్పుడు వృద్ధాప్యములో నున్నావు. ఇంతవరకు ప్రజలకు నీవు ధర్మాత్ముడవని నమ్మకముగలదు. కాని యిప్పుడు నీ పుత్రుని మూర్ఖత్వమునకు లోబడి సర్వనాశనమునకు సిద్ధమైనావు. ఇది నీకు గౌరవము చేకూర్పదు. శాంతి సాధనకై దూతరూపములో వచ్చిన శ్రీకృష్ణునకు విలువైన వస్తువుల నివ్వజూపుట వంచనయే. ఏలయన పాండవులు తమ పితృసంబంధ రాజ్యమును కూడా వదులుకొని కేవలము ఐదుగురి కైదూళ్ళిమ్మని కోరుచున్నారు. ఐనా వారి ఈ చిన్న కోరికను కూడా అంగీకరింపనందున నీవు శాంతిని కాంక్షించుటలేదని స్పష్టమగు చున్నది. నీవు శ్రీకృష్ణుని మాట నంగీకరింపుమని నా సలహా ఏలయన శ్రీకృష్ణుడు-

శ్లో ॥ 1) శమ మిచ్ఛతి దాశార్హస్తవ దుర్యోధనస్య చ॥

2) యేనైవ రాజన్నర్థేన తదేవాస్మా ఉపాకురు ॥ (మహా. ఉద్యో. 88-15,16)

పూజ్యుడైన శ్రీకృష్ణుడు ఇరుపక్షములలో శాంతిని నెలకొల్పుటకై యిచ్చటకు వచ్చెను. ఆయన నీయొక్క, దుర్యోధనునియొక్క శుభమును కోరును. ఆయనకు ధనముతో పనిలేదు. తన ఉద్దేశ్యము నెరవేరవలయును. తదనుగుణముగనే వారికి తోడ్పడుటకు మీరు యత్నింపుడని సలహానిచ్చెను.

శ్రీకృష్ణుడే స్వయముగా తన ఉద్దేశ్యమును తెలుపుట :

శ్రీకృష్ణుడు పాండవ పక్షమున దూతగా దుర్యోధనునకు నచ్చజెప్పుటకై బయలుదేరునపుడు ఆయన భావములెంత పవిత్రముగనున్నవో ఏ ఉద్దేశ్యములతో బయలుదేరెనో ఆయన మాటలలోనే మనకు తెలియును. కౌరవులవద్దకు వెళ్ళిన తరువాత దుర్యోధనుని మొండిపట్టుదల, తనమంచి మాటలను, సలహాలను విననందువలన శ్రీకృష్ణుడు మరొకరకముగ ఆలోచించుట వేరు. కాని, అంతకు పూర్వము శ్రీకృష్ణుడు శాంతిని స్థాపింపవలయుననియే ఆలోచించుచుండెను. చూడుడు.

శ్లో॥ ధర్మ్యం మస్మద్ధితం చైవకురూణాం యదనామయమ్ ॥

ఏషయాస్యామి రాజానం ధృతరాష్ట్రమభీప్సయా ॥ (మహా. ఉద్యోగ. 83)

శ్రీకృష్ణుడర్జునునితో - 'ఓ అర్జునా! నేను ధృతరాష్ట్రుని వద్దకు దూతగా వెళ్లుటకు కారణము - ధర్మసంగతమై, మనకు కౌరవులకు మంచిని చేకూర్చుదాని నచ్చటవారికి తెలియజేయగలందులకు' అనెను.

శ్రీకృష్ణుడు యుద్ధమున కెప్పుడంగీకరించెను?

భీష్మ, విదుర, గాంధారీ, ధృతరాష్ట్రుల ద్వారా మరియు తన ద్వారా చేయబడిన హితవాక్యోపదేశములను కులనాశకుడైన దుర్యోధనునిపై ఎట్టి ప్రభావమును చూపక అతడు పూర్వము వలెనే తన దురాగ్రహమును విడువనపుడు-

శ్లో॥ సామ్యాదౌ అయుక్తం మేరాజన్ సౌభ్రాత్ర మిచ్ఛతా ।
అభేదాయాస్య వంశస్య ప్రజానాం వివృద్ధయే ॥
పునర్భేదశ్చమే యుక్తోయదా సామ న గృహ్యతే ।
యదా నాద్రియతే వాక్యం సామపూర్వం సుయోధనః ॥
తదా మయా సమానీయ భేదితాః సర్వపార్థివాః ।
సర్వం భవతు తే రాజ్యం పంచగ్రామాన్ విసర్జయ ॥
ఏవముక్తోऽపి దుష్టాత్మానైవభాగం వ్యముఞ్చత ।
దండం చతుర్థం పశ్యామితేషు పాపేషు నాన్యథా ॥
(మహా. ఉద్యోగ. 150 అధ్యాయము)

సామ ,దాన, భేదోపాయముల వలన ఎట్టి ప్రయోజనము లేనపుడు వివశుడై విసుగుచెంది, గత్యంతరము లేక యుద్ధమున కంగీకరించెను. కనుక శ్రీకృష్ణుడు యుద్ధమునకెప్పుడు సుముఖుడు కాదని ఆయన నిష్పక్షపాతి, ధర్మాత్ముడు మరియు శాంతి ప్రియుడని మహాభారతము నామూలాగ్రముగ అవలోకించిన స్పష్టమగును.

## మహా తేజోసంపన్నుడు

"మంత్ర శ్రుత్యం చరామసి" అను ఆర్యోక్తి ననుసరించి వేదానుకూల ఆచరణతోనే మహాపురుషులు తమ జీవితములను ఉజ్జ్వలముగ నిర్మించుకొనిరి. అట్లే యోగిరాజు శ్రీకృష్ణుని జీవితము కూడ పూర్ణవైదికము. ఆయన మహాతేజస్వి. మానవులను పరిపూర్ణులుగ నిర్మించుట కేర్పరచిన సంస్కారవిధిలోని పద్ధతి ననుసరించి నామకరణ, ఉపనయన సంస్కారములు రెండింటిలోను బాలబాలికలు తేజస్వి / తేజస్వినులగుటకు ఆశీర్వాదము చేయబడును.

**' తేజోऽసి తేజోమయిధేహి '** - అను మంత్రములో మొదట తేజస్సుకొరకు ప్రార్థించబడినది. తేజస్సని ప్రకాశమునకు పేరు. ఇది పరమాత్మునినుండే లభ్యమగును. తేజస్సును పొందుటకు మానవులు ఈ క్రింది క్రమముననుసరింప వలయును. ప్రథమమున మానవుడు సహనశీలి కావలయును. తదుపరి దుష్టులపై క్రోధకారి కావలయును. వానివలన ఓజస్సు, బల పరాక్రమములతో

కూడిన తేజస్సు లభించును.

ధర్మరాజు - యుధిష్ఠిరుడు చేయు రాజసూయ యాగమునకు అన్ని ఏర్పాట్లు చేయబడినవి. దేశ దేశాంతరములనుండి ఆహ్వానింపబడిన ఋషులు, మహర్షులు, రాజులు, ప్రజాప్రముఖులందరూ సభనలంకరించిరి. యాగ నిర్వహణలోని వివిధ కార్యభారములను వేర్వేరుగ ఒక్కొక్కరికి అప్పగింపబడినవి. విద్వాంసులు, తపస్వులైన విప్రుల యెడల శ్రీకృష్ణునకు గల అగాధ శ్రద్ధాభక్తులు, ఆయనలోగల నమ్రత, వినయ శీలములు సహజరీతిలో మనకవగతమగును.

శ్లో॥ "సేవాధర్మః పరమ గహనో యోగినా మప్యగమ్యః "

అను భర్తృహరి సత్యోక్తి ననుసరించి యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు పరుల సేవయనెడు పరమ ఆభరణముతో సర్వదా' అలంకరింపబడెను. శ్రీకృష్ణుని లోని కార్యపటుత్వము వలననే ధర్మరాజు తలపెట్టిన రాజసూయయాగము అత్యంత సఫలమైనది. వ్రతదీక్ష పూర్తియైన తరువాత రాజైన యుధిష్ఠిరుడు సభలోనున్న రాజులలో సర్వశ్రేష్ఠుడు - అర్ఘ్య దానమున కర్హులెవరని భీష్మ పితామహుని అడుగగా శ్రీకృష్ణుడే అర్ఘ్య దానమున కర్హుడని చెప్పుచు -

శ్లో॥ జ్ఞానవృద్ధో మయారాజన్ బహవః పర్యుపాసితాః ।
తేషాం కథయతాం శౌర్యేణాహం గుణవతో గుణాన్ ॥ (సభా. పర్వ 38 - 12)

ఓ రాజా! నేను చాలామంది విద్వాంసులు, తపస్వీ మహాపురుషుల సత్సంగము చేసితిని. వారునేర్పిన గుణములతోనే నేనీసుగుణ శీలము పొందితిని.

శ్లో॥ అస్యాంహి సమితౌ రాజ్ఞామేక మప్యజితం యుధి।
న పశ్యామి మహీపాలం సాత్వతీపుత్ర తేజసా ॥

అందువలన ఓ రాజా! ఈ సభలోనున్న రాజులలో శ్రీకృష్ణుని వంటి అతులిత తేజోసంపన్నుడు కానరాడు ఇంకనూ -

శ్లో॥ వేదవేదాంగ విజ్ఞానం బలం చాప్యధికం తథా ।
నృణాం హిలోకే కస్యాస్తి విశిష్టం కేశవాదృతే ॥ (18)

శ్రీకృష్ణునిలో వేదవేదాంగముల విజ్ఞానము, అపరిమితమైన బలమున్నవి. ప్రపంచములో ఆయనకంటె అధికుడెవడున్నాడు. ?

శ్లో॥ దానం దాక్ష్యం శ్రుతం శౌర్యం హ్రీః కీర్తిర్ బుద్ధిరుత్తమా ।
సన్నతిః శ్రీర్ధృతిస్తుష్టిః పుష్టిశ్చ నియతాzచ్యుతే ॥ (19)

దానగుణము, దాక్షిణ్యము, శాస్త్రజ్ఞానము, శూరత (శౌర్యము), లజ్జా, కీర్తి, ఉత్తమబుద్ధి, నమ్రత, శోభ, ధైర్యము, తుష్టి, పుష్టి మున్నగు గుణములు శ్రీకృష్ణునిలో నిశ్చితముగ నున్నవి.

శ్లో॥ తమిమం సర్వసంపన్నం ఆచార్యం పితరం గురుమ్ ।
ఆచార్య మర్చిత మర్హాహం సర్వేసంమన్తు మర్హథ ॥ (20)

సర్వగుణ సంపన్నుడైనట్టి ఆచార్యుడు, తండ్రి, గురువు, పూజార్హుడు, యోగ్యుడైనట్టి శ్రీకృష్ణుని సన్మానింపవలయును.

శ్లో॥ నవృద్ధ బాలేష్వథవా పార్థివేషు మహాత్మసు ।
కోనార్హమ్మన్యతే కృష్ణం కోవాప్యేనం న పూజయేత్ ॥ (28)

బాలకులు, వృద్ధులు, రాజులు, మహాత్ములలో శ్రీకృష్ణుని పూజించుటకు యోగ్యునిగ నెంచనివారు, పూజింపని వారెవరును లేరు.

శ్లో॥ ఋత్విగ్ గురుర్ వివాహ్యాపశ్చ స్నాతకో నృతిః ।
సర్వమేతద్ హృషీకేశస్తస్మా దభ్యర్చితో ऽచ్యుత ॥ (సభా పర్వ. 38 - 22)

ఆయన ఋత్విక్, గురువు కన్యాదానముతో సత్కరించుటకు అనగా అల్లుడగుటకు యోగ్యుడు, స్నాతకుడు, ప్రజలకు ప్రియమైన రాజు. ఈ గుణములన్నీ ఒక్క ఈ జితేంద్రియ మహాపురుషునిలో మూర్తరూపమును దాల్చినవి. అందువలన శ్రీకృష్ణునకే ప్రథమ అర్ఘ్యము నివ్వవలయుననెను. ఈ విధముగ భీష్మ పితామహుని సమ్మతితో యుధిష్ఠిరుని ఆదేశము ననుసరించి సహదేవుడు శ్రీకృష్ణునకే సర్వ ప్రథమమున అర్ఘ్య దానము చేసెను.

శ్రీకృష్ణునకు జరిగిన ఈ గౌరవము అతని పూర్వశత్రువు చేదిరాజు శిశుపాలునకు సహింపరానిదైనది. అతడు శ్రీకృష్ణుడా సత్కారమున కనర్హుడని చెప్పుచు ఆయనను ప్రశంసించిన భీష్ముని, పాండవులను కూడ నిందించెను. శిశుపాలుడు మర్యాద నతిక్రమించి మానవులాడరాని దుర్భాషలను కూడ ప్రయోగించుచు శ్రీకృష్ణుని నిందించెను. ఇంత జరిగినను సహనమూర్తి, స్థితప్రజ్ఞుడు, ధైర్యధన సంపన్నుడు, యోగివర్యుడైన శ్రీకృష్ణుడు శిశుపాలుని కటుశబ్దములను వినియు కోపమును చెందలేదు. ఆయన తలచుకొన్నచో అప్పుడే వాని ప్రాణములను తీసెడివారు. ఆయనలో అంతటి బల పరాక్రమములున్నను అత్యంత మనోనిగ్రహముతో శిశుపాలుని మాటలను వినుచుండిరి. ఏలయన ఆయన 'సహోऽసి సహోమయిధేహి' -

అను వేదోక్తిని సాక్షాత్కారము గావించిరి. తరువాత శిశుపాలుడు శ్రీకృష్ణునితో శౌర్యాది గుణముల నపహాస్యము చేయుచు యుద్ధమునకై సవాలు చేసినపుడు ఆయనలోగల పరమ పావనమైన మన్యుగుణము మేల్కొని, ఆయన 'మన్యురసి మన్యుం మయిధేహి' అను పవిత్ర వాణిని పఠించుచు సభలోనున్న అనేకమంది రాజుల సమక్షముననే పాపియైన శిశుపాలుని యమపురి కంపెను. ఇదీ ఆయన దృష్టిలో క్రోధమును కలిగియుండుట యనగా - ధర్మానుసారముగ, యథా యోగ్యముగ వ్యవహరించుట. ఆయన కంసాదులను స్వయముగ చంపించుటలో జరిపిన వ్యవహారమునే మహాభారత యుద్ధమధ్యలో ధర్మ యుద్ధమును నడుపుచు, అధర్మాత్ముడైన జరాసంధుడు, జయద్రథుడు, కర్ణుడు స్వగోత్ర హంతకుడైన దుర్యోధనాదులను సంహరించి ధర్మరాజ్య స్థాపన గావించి పవిత్ర నీతిని ప్రకట మొనర్చెను. దుర్జన సజ్జనుల గూర్చి ఆలోచించి సజ్జనులలోని సహనశీలము నలవర్చుకొను సామర్థ్యము ఈ పవిత్ర మన్యువను గుణమును కలిగియుండుట వలననే మనన శీలురైన మానవులలో నుండును. అందుకే మహర్షి దయానంద సరస్వతి చెప్పినట్లు -

'సంసార దుఃఖదలనేన సుభూషితా యే ధన్యానరా విహితకర్మ పరోపకారాః'

దీనులు, బాధితుల దుఃఖములను పారగొట్టి నిరంతరము పరులకుపకారము చేయుటకొరకు ప్రయత్నమొనర్చు గుణము కలవారు ధన్యులు. అటువంటివారి ఓజస్సు, పరాక్రమములే సమాజములో పెరుగుచుండును. వారిలోనుండు జనాకర్షణ శక్తియే ఓజస్సనబడును. ఇట్టి శక్తి ఎల్లప్పుడు శ్రీకృష్ణునిలో నుండెడిది. దుర్యోధనుని పక్షముననుండి యుద్ధము చేయుచున్న వారిలో కర్ణుడు, శకుని మరికొందరు స్వార్థపరులైన వీరులు తప్ప మిగిలి భీష్మపితామహుడు మరియు గురువు ద్రోణాచార్యుడు మున్నగు మహారథులందరూ హృదయపూర్వకముగ కృష్ణుని పక్షమున నుండిరి. యుద్ధములో విజయము నొందుటకు వారందరి ఆశీర్వాదములు కృష్ణునిచే సంరక్షింపబడుచున్న అర్జునునితోసహా పాండవులకే యుండెడివి. వాస్తవముగ ఈ జనసంగ్రహమే ఆయనలోగల నిజమైన ఓజస్సుతోకూడిన బలమును గూర్చి తెలియజేయును. ఇందువలననే ఆయన వేదోక్త 'ఓజోఽసి ఓజోమయి ధేహి' యను వాక్యమునకు సాక్షాత్తు మూర్తిరూపముగ నుండిరి. ఓజస్సుతోపాటుగ ఆయన బలవంతుడు కూడా అగుటవలననే పాపాత్ముడైన కంసునివద్దకు ఆయన ఒక్కడేపోయి అతనినిచంపి స్వయముగ పాపరూప కర్మలకు ఫలితము ననుభవింపజేసెను.

దానితోపాటుగ తపము - త్యాగము కూడ తెలియజేయుచు దుష్టుడైన కంసుని ధార్మిక తండ్రియైన ఉగ్రసేనునకు మథురా రాజ్యమును పట్టముకట్టి ధర్మరాజ్యమును తిరిగి స్థాపించెను. శ్రీకృష్ణుడు అత్యంత బలశాలి, పరమ కార్యదక్షత గలవాడు, ధర్మాత్ముడని మనకవగతమగును. అందువలన ఆయనొక ఆదర్శ పురుషుడు. ఈవిధముగ 'బలమసి బలం మయి ధేహి' యను ఈ సత్యమైన ప్రార్థనను శ్రీకృష్ణుని జీవితములో ప్రత్యక్షముగ దర్శింతుము.

సహనశీలత, మన్యువు, ఓజస్సు, బలాది గుణములకు మూర్తిమంతుడైన శ్రీకృష్ణునిలో వీర్యత్వము కూడా తక్కువకాదు. ఆయన బ్రహ్మచర్య వ్రతమునుకూడ మిక్కిలి కఠోర సాధనతో పాలించుచుండెను. తన ఏకైకపత్ని రుక్మిణితో సంయమముతో ఉత్తమసంతాన ప్రాప్తికొఱకు 12సం॥రం॥లు పూర్ణబ్రహ్మచర్య వ్రతమును పాలించి తపమొనర్చిన ఫలితముగ శ్రీకృష్ణునకు అతి పరాక్రమవంతుడైన ప్రద్యుమ్నుడను పుత్రరత్నము కలిగెను. అతడు రూప, సౌందర్య, గుణశీలములలో ఆయనతో సమానముగా నుండెడివాడు. ఈ ఘటన వలననే వేదమంత్రములలో వర్ణించిన 'వీర్యమసి వీర్యం మయి ధేహి' అనుదానిని శ్రీకృష్ణుడు తన జీవనకాలమున పరిపూర్ణముగ వ్యవహారమున పాటించెనని బాగుగ తెలియుచున్నది.

ఈ విధముగ మహాభారతమందలి శ్రీకృష్ణుని జీవనమును నిష్పక్షపాతముతో పరిశీలించినచో పరమేశ్వరుని ఉపాసనతో సహనశీలము, ఈశ్వరీయగుణములను ధరించుచు పూర్ణఐశ్వర్యమును పొంది మానవతతో కూడిన సేవాభావమును సాధన చేయుటద్వారా సదాచార జీవనమును ప్రదర్శించెను. కనుకనే 'మహాజనో యేన గతః స పన్థాః' అను ఉక్తిననుసరించి మన పురాణ మహాపురుషుడు తేజస్వి ఆదర్శవంతుడైన శ్రీకృష్ణుని లోకోజ్వల చరిత్ర ననుసరించుచు కృతకృత్యులమై తేజస్వుల మగుదుము.

## కర్మయోగి

మం॥ కుర్వ న్నే వేహ కర్మాణి జిజీవి షేచ్ఛతగ్ ం సమాః ।
ఏవం త్వయి నాన్యథేతో ఽస్తి నకర్మ లిప్యతే నరే ॥

అను యజుర్వేదమునందలి 40 అధ్యాయములోని 2వ మంత్రము ననుసరించి శ్రీకృష్ణుడు జీవితాంతమువరకు మహత్త్వపూర్ణ కర్మలను త్యాగభావముతో, సమర్పణ భావముతో చేయుచుండెను. అందువలన ఆయన కర్మబంధనమునకు కారణము కాలేదు. ఆయన నిజమైన కర్మయోగి. కర్మ బంధనమునకు ముఖ్య

కారణములు మూడు. అవి కామ, క్రోధ, లోభములు. ఈ మూడు దోషములనుండి పూర్తిగ విడివడిన మానవుని జీవనము సమస్త మానవులకు ప్రేరణ నిచ్చునదగును. ఆయన ఒక యోగి. యోగశాస్త్రములో పతంజలి మహర్షి - 'యోగశ్చిత్తవృత్తి నిరోధః।' మానసిక వ్యాపారముల నాపుట యోగమని చెప్పెను. శ్రీకృష్ణుడు చిత్తవృత్తుల నాపిన పరమయోగీశ్వరుడు. 'యోగః కర్మసు కౌశలమ్।' కర్మాచరణలో నైపుణ్యము నొందుట యోగమనబడును. గీతలో యోగమును గూర్చి స్పష్టముగ నిట్లు చెప్పెను.

శ్లో॥ యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయః ।
సిధ్య సిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥

శ్రీకృష్ణుడు జయాపజయములలో, సఫలతాసఫలతలలో, హాని లాభములలో ఆసక్తిలేనివాడై సమానభావముతో కర్మాచరణమున నిమగ్నుడై యుండెడివాడు. ఈ విధముగ సమత్వభావముతో ప్రపంచమున కర్మల నొనర్చుచుండుటే కర్మయోగ మనబడును. ఫలాపేక్షలేకుండా ప్రతిపనిని చేయుటే కర్మయోగమనబడును. అట్టి కర్మాధారమున యోగము నారూఢించుట కర్మయోగమనబడును. శ్రీకృష్ణుని సమగ్ర పవిత్ర జీవన చరిత్ర దీనిపైననే ఆధారపడియుండెను. అందువలననే ఆయన కర్మయోగి 'పరిత్రాణాయ సాధూనాం' సజ్జనులను రక్షించుట కొరకు, 'వినాశాయచదుష్కృతామ్'దుష్టులను నాశనమొనర్చుట కొరకు, 'ధర్మసంస్థాపనార్థాయ' ధర్మమును నిలుపుట కొరకు ఈ క్షణభంగురమైన మానవజీవనమును గడుపవలయునని తన జీవనము ద్వారా ఆయన మానవులందరకూ ప్రేరణ నొసగెను.

ఆయన తపస్వి, సచ్చరిత్రుడు, సద్గుణ సంపన్నుడు. ఆయన విలాస పురుషుడు, కాముకుడు కాడు. ఆయన బలిష్ఠుడు, శక్తిమంతుడు, గోకులములో బాల్యావస్థలో పూతన, శకటాసురుడు, త్రిణావర్తుడు, బకాసురాది దుష్ట రాక్షసులను నాశనమొనర్చెను. శ్రీకృష్ణ బలరాములు సభాభవనమున చాణూర్, ముష్టిక్, శల్, తోషల్‌లతో మల్లయుద్ధము చేసి పరాజితులను చేసిరి. విలాసవంతుడు, భోగి, కాముకుడైన వ్యక్తిలో ఇంతటి బలము, త్యాగము లెచ్చటినుండి వచ్చును.?

శ్లో॥ బ్రహ్మచర్యం మహద్ ఘోరం తీర్త్వా ద్వాదశ వార్షికమ్ ।
హిమవత్ పార్శ్వమభ్యుపేత్య యో మయా తపసార్జితః ॥
సమాన వ్రత - చారిణ్యాం రుక్మిణ్యాం యో ऽన్వజాయత ।
సనత్కుమార - తేజస్వీ ప్రద్యుమ్నో నామ మే సుతః ॥

పై శ్లోక ప్రమాణానుసారము తనపత్ని రుక్మిణితో హిమాలయములలో బ్రహ్మచర్య వ్రతపాలన చేయుచు, తపస్సు నాచరించుచు ప్రద్యుమ్నుడను తేజోవంతుడైన పుత్రుని ఉత్పన్నము గావించెను. కనుక అతడు విలాసవంతుడు, కాముకుడు, భోగలాలసుడు కాడు. అతడు కర్మను జయించిన యోగి.

దూతగా వెళ్ళిన శ్రీకృష్ణుని దుర్యోధనుడు నిండు సభలో అవమానించినను కోపము చెందక అత్యంత శాంతచిత్తముతో నుండెను. శిశుపాలునినేక అపరాధములను సహించెను. ఈ విధముగ శ్రీకృష్ణుడు క్రోధమును కూడా జయించెను.

'ఆతతాయిన మాయాన్తం హన్యాద్ధేవా విచారయన్ ।

దుష్టులను, దుష్టుల పక్షమును వహించిన వారిని నాశనమొనర్చెను. పరమ నీతి కోవిదుడైన శ్రీకృష్ణుడిదంతయూ స్వార్థచింతనలేకుండా నిష్కామ భావనతో చేసెను. -

కర్మయోగియైన శ్రీకృష్ణుని కాలములో నున్న వారిలో అధికులు ధర్మము నెరిగినట్టివారు; అసమాన యోధులు, తపస్వులు కూడా. వారు **'అర్థస్య పురుషోదాసః'** ధనమునకు దాసులై సత్యమును చెప్పుటకు సాహసింపకుండిరి. నిండుసభలో శ్రీకృష్ణుడు గొప్ప గొప్ప దిగ్గజముల వంటి వారిని, చెడును సమర్థించుచున్నందులకు ధైర్యముగ మందలించెను. దుర్యోధనుని రాజ ప్రాసాదములో ఒకనాడు -

శ్లో॥ సంప్రీతి - భోజ్యాన్యన్నాని ఆపద్ భోజ్యాని వా పునః ।

న చ సంప్రియసే రాజన్ నచైవాపద్ గతా వయమ్ ॥

**(ఉద్యోగ పర్వ. 91-25)**

రాజా! ఎవరింటిలోనైన భోజనము చేయుటకు రెండు కారణములుండును. ఒకటి ప్రేమతో పిలిచి భోజనము పెట్టునపుడు గాని, లేక ఆపదలోనుండి అన్నము దొరకనందున మరొకరి వద్దకు పోయి యాచించి నపుడు గాని. కాని యిప్పుడు నీలో ప్రేమభావమూ లేదు. మాకు భోజనమునకెట్టి ఆపదా లేదు. అని దుర్యోధనుని ఆతిథ్యమును నిరాకరించెను.

శ్రీకృష్ణుడొక మహాకర్మయోగి, ఆయన భారతదేశమునందలి రాజులందరి నొకటిగ చేయుటకు ప్రయత్నమొనర్చెను. ఆ రోజులలో 'గృహే గృహే హి రాజానః స్వస్య స్వస్యప్రియం కరాః ఇంటింటికొక రాజుగనుండి వారు తమతమ స్వార్థము కొరకు ప్రయత్నించుచుండిరి. కంస జరాసంధాది దుష్ట రాజులను హతమార్చి

భారతదేశము నొకే త్రాటిపై తెచ్చుట కాయన యత్నించెను. ఆయన ఎవరి రాజ్యమును కాంక్షింపలేదు.

' మా గృధః కస్య స్విద్ధనమ్' (యజు. 40 - 1) అను వేద వాక్యమును పాటించు మహాపురుషుడు. యుద్ధభూమిలో నిరాశ చెందిన అర్జుననకు గీతా ప్రబోధమును చేసి బ్రాహ్మణ కార్యమును నిర్వహించెను. కంసాదులను చంపి క్షత్రియ వర్ణ మర్యాదను పాటించెను. స్వయముగ గోవులను పాలించి - గోపాలుడై దేశ అర్థిక స్థితిని పెంపొందించుటకై ఇతరులకు ప్రేరణనొసంగి వైశ్య వర్ణ ధర్మమును పాటించెను. ధర్మరాజొనర్చిన రాజసూయ యాగమునకై వచ్చిన ఋషి మునుల, విద్వాంసుల చరణ పాదుకలను (పాదరక్షలను) కాపాడుట, వారి పాదములు ప్రక్షాళనము చేయు వ్రతమును తీసుకొని శూద్రవర్ణ ధర్మమును పాటించెను. ఈ విధముగ వారు - "మస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్।" అను వాక్యము ననుసరించి సమగ్ర జీవితమును గడుపు ఆదర్శ కర్మ పరాయణుడైన మహాపురుషుడు.

నేటి విలాసపూరిత యుగమున భౌతిక వాదముతో దారితప్పి జీవించుచున్న నవయువకులు, వృద్ధులు, మానవమాత్రులందరికి మహాభారతములో వర్ణింపబడిన శ్రీకృష్ణుని జీవితము అత్యంత ప్రేరణ నొసంగును.

## యుద్ధ నీతి

'శఠేశాఠ్యం సమాచరేత్' అను నీతిని శ్రీకృష్ణ భగవానుడనుసరించు చుండెడివారు. ఆయన గొప్ప రాజనీతికోవిదుడు. దేశకాల పరిస్థితుల ననుసరించి ఆయన రాజనీతిని ప్రయోగించుచుండెడివారు. మహాభారత యుద్ధములో కౌరవ సేనలోని గొప్పగొప్ప అతిరథులు, మహారథులు చనిపోయి 11 అక్షౌహిణీల సైన్యము ఛిన్నాభిన్నమై పోయినది. కౌరవులలో ద్రోణాచార్యుని కుమారుడు అశ్వత్థామ, కృపాచార్యుడు, కృతవర్మలు కాక దుర్యోధనుడొక్కడే మిగిలియుండెను. అప్పుడు దుర్యోధనుడు పారిపోయి ద్వైపాయనమను పేరుగల నీటి మడుగులో దాగుకొనెను. యుద్ధములో మేముండగ నీకేమి భయము లేదని అశ్వత్థామ ఒకవైపు అభయమిచ్చుచున్నను దుర్యోధనుడు భయభీతుడై ధైర్యము చాలక పారిపోయి దాగుకొనెను. శ్రీకృష్ణుడు, పాండవులు గూఢచారుల ద్వారా దుర్యోధనుని జాడ తెలుసుకొని ఆ సరోవరము వద్దకు వచ్చిరి. అచ్చట శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునకు నచ్చజెప్పుచూ - 'ధర్మరాజా! ఈ దుర్యోధనుడు మాయకపటములలో నత్యంత

నిపుణుడు. ఇతనిని మాయోపాయము చేతనే వధింపవలయును. మాయావిని మాయోపాయము చేత జయింపవలయుననునదే సరియైన నీతి' యనెను.

తరువాత ధర్మరాజు దుర్యోధనుని దూషించుచు ' ఓ దుర్యోధనా! క్షత్రియ వంశమును, నీ కుటుంబమునంతయు నాశనమొనర్చి యిచ్చట జలములో దాగుకొని యున్నావా? వీరులు యుద్ధభూమి నుండెన్నడును పలాయనము గావింపరు. పిరికిపందవలె నీవిట్టి నీచమార్గమున కెందుకు దిగితివి.? ఒకనాడు సూదిమొన మోపినంత భూభాగమును కూడా యివ్వనంటివి గదా! నేడు నీ స్వాభిమానమేమైనది' యనెను. యుధిష్ఠిరుని పరుష వాక్యములను విన్న దుర్యోధనుని స్వాభిమానము జాగృతమైనది. అతడు మడుగులోనుండి బయటికి వచ్చి యుధిష్ఠిరునితో పాండవులలో నెవరివలనను నాకు భయములేదు. నేను ధర్మయుద్ధము చేయుటకు సిద్ధముగ నున్నాను. అనగా యుధిష్ఠిరుడు తొందరపాటుతో వెంటనే ' నీవన్నది ధర్మముగనే యున్నది. కనుక నీవు మాలో నెవరైనా ఒకరితో యుద్ధము చేసి ఓడించినచో రాజ్యమునంతా నీకిచ్చి వేయుదును. లేక యుద్ధములో నీవు మరణించినచో వీరస్వర్గము నలంకరింతువనెను.'

శ్రీకృష్ణుడిది విని చాలా ఆందోళన చెంది యుధిష్ఠిరునితో నీవు చేస్తున్నదేమిటి? ఇంతవరకు కష్టపడినదంతా సర్వనాశనమొనర్చితివి. దుర్యోధనుడు నిన్నుగాని, నకులాదులలో నెవరినైనా యుద్ధమునకు పిలిచినచో నేమగును? నీవు దుర్యోధనుని పౌరుషమును, రాజనీతి నెరుగవు. మరల మరొక జూదమును ప్రారంభించితివి. ఇది పూర్వపు జూదము కంటె భయంకరమైనది. దుర్యోధనుడు గదా యుద్ధములో చాలా చతురుడు. మీలో నెవరునూ అతని నెదిరించలేరు. సాక్ష్యాత్తుగ ఇంద్రుడు వచ్చినను, అతనిని గదా యుద్ధములో ఓడించలేడనగా, భీముడు కల్పించుకొని ఓ మధుసూదనా! నీవేమి భయపడకు. నేనీ పాపినిప్పుడే చంపి నా పగ తీర్చుకొందుననెను. ఈ మాటలు విన్నంతనే దుర్యోధనుడు భీమునితో యుద్ధమునకు సిద్ధమయ్యెను. వారిరువురు భయంకరముగ యుద్ధము చేయుచుండగ, గదా యుద్ధములో నైపుణ్యముగల శ్రీకృష్ణుడర్జునునితో ' ఓ అర్జునా! భీముడు బలవంతుడైనప్పటికిని గదా యుద్ధములో దుర్యోధనుడు భీమునికంటె అధిక చతురుడు. భీముడు ధర్మయుద్ధము చేయుచున్నంతకాలము దుర్యోధనుని జయింపలేడని,' ధర్మరాజుతో జూదమాడినప్పుడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టుదునని భీముడు ప్రతిజ్ఞ

చేసెను. గనుక ఇప్పుడు మాయావియైన ఈ దుర్యోధనుని చంపుటకై ఆ మాటను గుర్తు చేయుచు శ్రీకృష్ణుడు భీమునకు దుర్యోధనుని తొడ విరుగగొట్టుమని సంకేతము చేసి దుర్యోధనుని చంపించెను. ఈ విధముగ సమయస్ఫూర్తితో యుద్ధనియమముల నుల్లంఘించి కూడా మాయావులైన శత్రువులను నాశనమొనర్చు రాజనీతి చాతుర్యము శ్రీకృష్ణునిలో నుండెను.

యుద్ధ నియమముల నుల్లంఘించి భీముడు దుర్యోధనుని చంపిన వార్త విని గదాయుద్ధ మహారథియైన బలరాముడు ఉగ్రుడై భీముని నిందించుచు - నీవు దుర్యోధనుని నాభికి క్రిందిభాగమున కొట్టుట అపరాధము. నిన్నిప్పుడే చంపుదుననగా శ్రీకృష్ణుడు వెంటనే అడ్డుకొని బలరామునకు నీతిని బోధించి శాంతింపజేసెను. 'అన్నయ్యా! మానవుని యున్నతి 6 విధములుగనగును, 1. తన ఉన్నతి, 2. మిత్రుని ఉన్నతి, 3. మిత్రునకు మిత్రుని ఉన్నతి 4. శత్రుహాని, 5. శత్రువుయొక్క మిత్రుని హాని, 6. శత్రువుయొక్క మిత్రునియొక్క మిత్రుని హాని. మన మిత్రులను ప్రమాదములనుండి రక్షించుట కెల్లప్పుడు ప్రయత్నించుచుండవలెను. పాండవులు ధర్మము నాశ్రయించి మనకు సహజముగనే మిత్రులైరి. అత్త కుమారులగుటవలన వారు మనకు బంధువులు కూడా. శత్రువు వీరిని నిరంతరము ఛలకపటములతో మోసగించుచునే యుండెను. దుర్యోధనుని తొడలు విరుగకొడుదునని భీముడింతకు పూర్వమే ప్రతిజ్ఞ చేసెను. క్షత్రియుడు తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొన వలెను గదా! అన్నా! బలరామా! మీరు అరిభయంకరులుగ ప్రసిద్ధులు. భీముడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుటకై తన శత్రువును చంపెను. ఇందులో అతని దోషమేమియు లేదు. కనుక మీరు శాంతింపుడు. ఈ పాండవ బంధువుల ఉన్నతియే మనయున్నతి' యనెను.

ఒకసారి కర్ణునితో యుద్ధము చేయుచున్న అర్జునునకు యుధిష్ఠిరుడు కనబడలేదు. అందువలన కృష్ణార్జును లిరువురు యుధిష్ఠిరుని వెదుకుచుండిరి. వారిరువురను చూచి కర్ణుని వధించి వచ్చిరని యుధిష్ఠిరుడు తలంచెను. కాని తరువాత అతడు చనిపోలేదని తెలిసిన యుధిష్ఠిరుడు క్రోధముతో - నీవు యుద్ధములో నుండి పారిపోయి యెందులకు వచ్చితివి? ఇది క్షత్రియ లక్షణమేనా అని అర్జునునిపై మండిపడుచు -

**'ధిక్ గాండీవం ధిక్ చ తే బాహువీర్యమ్।'**

గాండీవమున కవమానమనెను. అన్నగారి ఈ మాట విన్నంతనే అర్జునుడు

మండిపడుచు -

తన గాండీవమునెవరైనా ధిక్కరించినచో యతనిని ప్రాణములతో వదలనని ఇంతకుపూర్వమే అర్జునుడు ప్రతిజ్ఞ చేసినందున -

'అసిం జగ్రాహ సంక్రుద్ధో జిఘాంసుర్ భరతర్షభమ్ ।'

యుధిష్ఠిరుని చంపుటకై అర్జునుడు కత్తిని తీసెను. అట్టి సంకటస్థితిలో శ్రీకృష్ణు డర్జునుని శాంతింపజేయకున్నచో అంతవరకు తాను చేసినదంతా చెడిపోవును. అందువలన వెంటనే శ్రీకృష్ణుడిట్లనెను. ' ఓ అర్జునా! నీవు ధర్మరహస్యము నెరుగవు. కనుక నీవెప్పుడో చేసిన ప్రతిజ్ఞను యిప్పుడు తప్పక పాలింపవలయుననుచున్నావు. ప్రాణిహింసను మించిన అధర్మము లేదు. ఏదైనా ప్రాణిని రక్షించుటకై అసత్యము చెప్పినను యది ధర్మమే యగును.

కనుక నీ విప్పుడు ప్రతిజ్ఞాపాలన కొరకు నీ పెద్దన్నను చంపినచో యది ప్రతిజ్ఞాపాలనకాక మహాపాపమగును. సత్యాసత్యములేమిటో విను -

శ్లో॥ భవేత్ సత్యమవక్తవ్యం వక్తవ్య మనృతం భవేత్ ।
యత్రానృతం భవేత్ సత్యం చాప్యనృతం భవేత్ ॥ (మహా. కర్ణపర్వం 69 అ)

అసత్యము చెప్పుటవలన ఇతరులకు - సజ్జనులకు మేలు జరిగినచో యది కూడా ధర్మమేయగును. సత్యము చెప్పుటవలన ఇతరులకు - మంచివారికి హాని కలిగినచో యాసత్యముకూడా అధర్మమేయగును. కనుక నీ సత్య ప్రతిజ్ఞాపాలన వలన మంచివారెవరికైనా అమంగళము జరిగినచో యా ప్రతిజ్ఞాపాలన అధర్మమే యగును' అని అర్జునుని శాంతింపజేసెను.

కౌరవ వీరులును, వారి సైన్యమునంతా పూర్తిగా నాశనమొనర్చిన తరువాత పంచపాండవులతో కలిసి శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని ఓదార్చుటకై హస్తినాపురమునకు వెళ్ళెను. అచ్చట ధృతరాష్ట్రుడు, యితర స్త్రీలు గొల్లున ఏడ్చుచు అచ్చటికి వచ్చిన యుధిష్ఠిరుని చుట్టుముట్టి నీవు తాతలను తమ్ములను, గురువు, గురుపుత్రుడు, మిత్రులు మున్నగు వారందరినీ చంపుటకు నీ ధర్మము, దయాది గుణము లేమైనవని ప్రశ్నింపసాగిరి. బంధువులను, స్నేహితులను చంపి లభించిన రాజ్యము నేమి చేసుకుందువని విలపించుచుండగా ధర్మరాజు కూడ కొంతతడవు వారితో కలసి విలపించి తదుపరి ధృతరాష్ట్రుని వద్దకుపోయి ప్రణమిల్లెను. శోకతప్త హృదయముతో ధృతరాష్ట్రుడు యుధిష్ఠిరుని కౌగలించుకొని దుఃఖించుచు దుర్యోధనుని వధించిన భీముని కొరకు ఈర్ష్యాదృష్టితో వెదుకసాగెను. భీమునిపై

క్రోధాగ్నితో మండిపడుచున్న ధృతరాష్ట్రుని మనోభావములను గ్రహించి వెంటనే ముందున్న భీమునొక్కమారుగ ప్రక్కకునెట్టి యతని స్థానములో భీముని లోహ విగ్రహమును ధృతరాష్ట్రుని ముందుంచెను. దీనికి కారణ మచ్చటి వారెవ్వరికిని అర్థము కాలేదు.

ధృతరాష్ట్రుని ఆలోచన ఇతరులెవరికీ అర్థము కానేలేదు. కాని శ్రీకృష్ణుడు మాత్రము వెంటనే గ్రహించి భీముని రక్షించెను. ధృతరాష్ట్రుడా విగ్రహమునే భీముడనుకొని గట్టిగా కౌగలించుకొని ముక్కలు ముక్కలుగ జేసెను. లోహపు విగ్రహమునంత బలముగా నొక్కినందున ధృతరాష్ట్రుని నోటినుండి రక్తము, ఛాతియందు నొప్పిరాగా సంజయుడు అట్లు చేయుట మంచిదికాదని ధృతరాష్ట్రునితో ననెను. అప్పటికి క్రోధాగ్ని చల్లారి ధృతరాష్ట్రుడు అయ్యో భీమా! అయ్యో భీమా! యని విలపింపసాగెను. అప్పుడు శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునితో తాను చేసిన పనిని తెలిపి, నీ సంకల్పమును నేను ముందుగనే తెలుసుకొని వెయ్యి ఏనుగుల బలము గల నీనుండి రక్షించితిని. నీ పుత్రుడు దుర్యోధనుడు చేయించి యుంచిన భీముని లోహపు విగ్రహమునే నీవు ముక్కలు చేసితివి. భీముడు సురక్షితముగనే యున్నాడు. కనుక దుఃఖింపవలదనెను. మరొకనాడు...

కర్ణార్జునులిరువురు ఘోరయుద్ధము చేయుచుండగా అకస్మాత్తుగ కర్ణుని రథముయొక్క కుడి చక్రము భూమిలో దిగబడెను. కర్ణుడు రథము నుండి దిగి అర్జునునితో - 'అర్జునా! రెండు నిముషములాగుము. నా రథ చక్రమును తీసుకొందుననెను. నీకు భయపడి నేనీ మాటలనుటలేదు. నీవు శూరుడవు. యుద్ధ నియమములు తెలిసినవాడవు. కనుక నియమపాలన చేయుమని చెప్పుచున్నాననెను.' అప్పుడు వెంటనే కృష్ణుడు కర్ణునితో 'ఓ కర్ణా! దుర్జనులు ఆపదలలో తమ చెడు కర్మలను నిందించుటకు బదులుగా తమ భాగ్యమును నిందింతురు. నీవిప్పుడు యుద్ధ ధర్మములను వల్లించుచున్నావు. కాని నిండుసభలో రజస్వలయైన ద్రౌపదిని అవమానమొనర్చు నాడీ ధర్మమేమైనది. ?

2. ధర్మరాజు - యుధిష్ఠిరుని మాయాజూదములో శకుని మోసగించి ఓడించినపుడు నీ ధర్మ మెక్కడికి పోయినది.?

3. వనవాసము చేసి తిరిగి వచ్చిన తరువాత కూడా పాండవులకు వారి రాజ్యమివ్వనపుడీ ధర్మమేమైనది. ?

4. నీ సలహాతో దుర్యోధనుడు భీముని సర్పములతో కరపించి విషాన్నమును

తినిపించినపుడు నీ ఈ ధర్మమేమైనది. ?

5. వరణావత నగరములో లక్క గృహములో నిదురించుచున్న పాండవులను నీవు దహనమొనర్చుటకు ప్రయత్నించినపుడు నీధర్మ మే మైనది.?

6. నిండుసభలో నీచ దుశ్శాసనుడు ద్రౌపదిని అపహాస్యము చేసినపుడు నీ ధర్మమేమైనది.?

7. అర్జున కుమారుడు అభిమన్యుని ఏడుగురు మహారథులు ఏకమై నలువైపులనుండి చుట్టుముట్టి చంపినప్పుడు నీ ధర్మమేమైనది.?

పై సమయములన్నింటిలో లేని ధర్మపాలనము తిరిగి నేడెందులకనిన శ్రీకృష్ణుని మాటలకు సిగ్గునొంది సమాధానమివ్వజాలక కర్ణుడు తలవంచుకొనెను. వెంటనే అర్జుననకు శ్రీకృష్ణుడు సైగచేసి ఇదే సమయము దివ్యాస్త్రముతో కొట్టుమనెను.

కర్ణుడు అర్జునుని బాణముల ధాటికి తట్టుకొనలేక బ్రహ్మాస్త్రమును ప్రయోగింపగా అర్జునుడు కూడా బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. కర్ణుడు వరుణాస్త్రమును ప్రయోగించి బ్రహ్మాస్త్రము వలన ప్రజ్వలించెడు అగ్నిని శాంతమొనర్చి అర్జుననిపై మరొక తీవ్రాస్త్రమును ప్రయోగించి, ఇంతలో తన రథచక్రమును పైకి లాగుచుండెను. అప్పుడర్జునుని స్థితి దయనీయముగ నున్నది. ఐనా, ఈ అవకాశమును జారవిడిచిన మరల కర్ణుని ఓడించుటసంభవమని తలంచి శ్రీకృష్ణుడు అర్జునునితో - కర్ణుడు రథము మీదకు రాకముందే నీవతని శిరస్సును వధింపుము. లేకున్న ఈ అవకాశము చేజారిపోవుననెను. వెంటనే అర్జునుడు 'అంజలికా' యను భయంకర బాణముతో కర్ణుని శిరస్సును ఛేదించెను.

ఈ ప్రకారముగ సమయోచితముగ యుద్ధ కౌశల్యమును ప్రదర్శించి అర్జునునితో కర్ణాదులను చంపించి విజయమును సాధించెను.

## ఆర్య ఆదర్శములకు ప్రతీక

మానవుడు తన జీవితములో సర్వోచ్ఛస్థానము నధిరోహించి ఒక సాధారణ వ్యక్తిగనుండి మహామనీషిగ, యుగపురుషునిగ అత్యున్నత స్థానము నలంకరించు ననుటకు శ్రీకృష్ణుని జీవితమొక అత్యుత్తమ ఉదాహరణ. వివశతాపూర్ణ పరిస్థితులల్లో కారాగారమున జన్మించియు, మానవుడు ప్రపంచమున మహానాయకునిగ రూపొంద గలుగునని శ్రీకృష్ణుని జీవితము నవలోకించిన విదితమగును. బంకించంద్రుని దృష్టిలో శ్రీకృష్ణుడు తన జ్ఞానార్జన, కార్యములొనర్చుటలో కౌశలము, అందరిచే రంజింప (ప్రేమింప) బడుట యను మూడు గుణములలో సంపూర్ణ వికాసమును

సాధించుటవలన ఆయన తన సమకాలికులలో గొప్ప రాజకీయవేత్తగా, సమాజ వ్యవస్థాపకునిగ అత్యున్నత గౌరవస్థానము నలంకరింపగలిగెను.

బాల్యమునుండి జీవిత పర్యంతము శ్రీకృష్ణుడు ఉన్నతపదవుల నొందుచునే యుండెను. ధర్మానుసారముగ కర్తవ్యపాలన నొనర్చుటలో ప్రేరణనిచ్చుటే ఆయన జీవనోద్దేశ్యముగ నుండెడిది. ఆయన స్వయముగ ధర్మమును పాలించుటలో నిష్ఠగలిగి దాని వాస్తవిక రహస్యమునెరిగి యితరులకుపదేశించునట్టి మహాధర్మోపదేష్ఠ. అందువలననే మహర్షి దయానందుడు - 'శ్రీకృష్ణుడు జననమునుండి మరణ పర్యంతము చిన్నచెడు పనినికూడ చేసి యుండలేదని' చెప్పెను. దీనికి కారణమాయన ధర్మపాలనయే. అందువలననే మహాభారత కారుడిట్లు వ్రాసెను -

'యతోధర్మ స్తతోకృష్ణో, యతః కృష్ణ స్తతోజయః ।

కృష్ణుడున్నచోట ధర్మము, ధర్మమున్నచోట జయముండును. యోగేశ్వర కృష్ణుడు , గాండీవధారి అర్జునుడు యున్నచోటనే శుభముజరిగి అచ్చటనే విజయముకూడ నుండును. అధికముగ చెప్పవలసిన అవసరములేదు. శ్రీకృష్ణుడే అవతారపురుషుడైనచో ఈ మాటలకర్థము - విలువ యుండదు. ఈ మాటలు శ్రీకృష్ణుని ఉచ్చకోటికి చెందిన మానవ భావననే తెలియజేయుచు ఆయనను సాధారణ మానవుని దశనుండి - మహాపురుషునిగ చేసి యోగేశ్వరునిగను, పురుషోత్తమునిగను జేసినవి.

శ్రీకృష్ణుని బాల్యమును చూచినచో ఆయన దృఢవిచారములు గలవాడు, దృఢకాయము గలవాడు . శాంత మనస్కుడు, సంకల్పనిష్ఠ, ఆత్మబలముతో కూడిన బ్రహ్మచారిలో నుండదగు విశేష గుణములన్నియు మనకు ఆయనలో లభించును. ఆయన శారీరికబల మసమానమైనది. అందువలన అయన బాల్యముననే అనేక భయంకర, హింసక జంతువులను వధించెను. వయస్సుతోబాటు ఆయన యుద్ధకౌశల్యమును, యుద్ధనీతిని సాంగోపాంగముగ నధ్యయన మొనర్చెను. అర్జునుడు, సాత్యకిల వంటి యుద్ధవీరులాయన శిష్యులుగనుండి ఆయనవద్ద విద్యనార్జించిరనిన ఆయన యుద్ధనీతిలో నెంతటి ప్రకాండ పండితుడో మనకు బోధపడును. గదాయుద్ధమును కూడ బాగుగా నెరిగిన అయన నిర్భయ, చతురతలకు నిలయము.

శ్రీకృష్ణుడు శారీరికబలమును మించిన శాస్త్రీయజ్ఞానము కూడ కలవాడు. ఆయన వేదవేదాంగ విదుడని భీష్మని వచనములద్వారా మనకవగతమగును.

వీటితోపాటుగ సంగీతము, చికిత్సాశాస్త్రము మున్నగు ననేక లౌకిక విద్యలలోకూడ పారంగతుడు. మృతప్రాయుడైన ఉత్తరయొక్క కుమారుడు పరీక్షిత్తును రక్షించుట, వేణుగానముతో జగము నానందడోలికలనోలలాడించుట, రథసారథియై భయంకర యుద్ధభూమిలో అర్జునుని రక్షించుట మున్నగు అంశములీవిషయమును సిద్ధింపజేయును.

శారీరిక మానసిక శక్తుల సంపూర్ణ వికాశమునొందిన ఆయనతో సమముగ అచారపాలన ఆయన సమకాలికులెవరును చేయకుండెడివారు. ఆయన గొప్ప సదాచారియైన శీలవంతుడు. తల్లిదండ్రుల, మరియు గురుజనుల ఆజ్ఞాపాలనము, వారియెడల పూజ్యభావము నెన్నడును ఆయన విస్మరించలేదు. మాదక ద్రవ్యములు (మత్తు పదార్థముల) సేవనము, జూదమునాడుట మున్నగువానికి దూరముగనుండి యాదవులను కూడ మత్తుపానీయములను త్రాగి పట్టుబడినచో రాజదండన కర్హులని ఆదేశించెను. బ్రహ్మచర్యపాలన, ఏకపత్నీ వ్రతములను దృఢముగ పాలించుచుండెను. కాని పురాణములలో నిట్టి ఉజ్జ్వల గుణములను విస్మరించి ఆయనను కామాంధునిగ, లంపటుడు, కుటిలుడు, యుద్ధోన్మాదిగ చిత్రించుట అత్యంత విచారకరము.

శ్రీకృష్ణుడు సంధ్యోపాసన, అగ్నిహోత్రాది నిత్యకర్మల నాచరించుటలో నెన్నడును ప్రమాదము (సోమరితనమును) నొనర్పలేదు. మహాభారతము నందలి యనేక స్థానములలో నీవిధమైన ఆయన దినచర్య మనకు లభించును. దుర్యోధనునితో సంధిచేసుకొనుటకు వెళ్ళుచున్నపుడు ప్రాతః సాయం సమయములలో సంధ్యాగ్నిహోత్రాదులు చేయుటాయన మరువలేదు. మహాభారతములో -

శ్లో॥ ప్రాతరుత్థాయ కృష్ణస్తు కృతవాన్ సర్వమాహ్నికమ్ ।
బ్రాహ్మణైరభ్యను జ్ఞాతః ప్రయయౌ నగరం ప్రతి ॥

శ్రీకృష్ణుడు ప్రాతఃకాలముననే లేచి సంధ్యాగ్నిహోత్రాది దైనిక కర్మల నొనర్చి యనంతరము బ్రాహ్మణుల ఆజ్ఞను తీసుకొని నగరమునకు బయలుదేరును. ఇట్లే మరొక చోట -

శ్లో॥ కృత్వాపూర్వాహ్ణికం కృతం స్నాతః శుచిరలంకృతః ।
ఉపతస్థే వివస్వంతం పావకంచ జనార్ధనః ॥

శుభ్రమైన వస్త్రాభరణాదులను ధరించి సంధ్యావందనము, పరమేశ్వరుని

ఉపస్థానము,అగ్నిహోత్రాదులను సంపన్నమొనర్చెను. నిత్యము సంధ్యా,యోగముల (బ్రహ్మయజ్ఞము) ద్వారా సచ్చిదానంద పరమేశ్వరుని పూజించువాడు, ఆర్యోచిత మర్యాదలను పాలించుచు రక్షించువాడైనట్టి మహాపురుషుడు శ్రీకృష్ణుని సాక్షాత్తు ఈశ్వరునిగ చిత్రించువారి అమాయకత్వము నేమనవలయును.

శ్రీకృష్ణుని చరితములో నత్యంత విశేషమైనది ఆయనలోని రాజనీతితో కూడిన విచక్షణాజ్ఞానము. రాజనీతియం దాయనకుగల విశేషానురాగము స్వార్థచింతనతో గాని సంకుచిత భావముతోకూడి యున్నది గాని కాదు. నేడున్నటు వంటి సంకుచిత జాతీయవాద మాయుగములో లేకుండెను. లోకకల్యాణమునకు ప్రజాహితమును కలిగించి, నానారకములైన అరాచకములు, అన్యాయములు, అక్రమముల నంతమొందించి ధర్మరాజ్యమును నెలకొల్పు లక్ష్యముతోనే శ్రీకృష్ణుడు తన రాజనీతిని జాతీయవాదము ననుసరించెను. సంపూర్ణ మానవజాతి కల్యాణమునేగాక సమస్త ప్రాణకోటి శ్రేయస్సు నాకాంక్షించి రాజకీయ రంగమున ప్రవేశించెను. తన జన్మస్థలమైన మధురాజనపద స్వేచ్ఛాచారి, నిరంకుశ పరిపాలకుడు, అత్యాచారియైన కంసునిపై శ్రీకృష్ణుని దృష్టి మొట్టమొదటిగ పడెను. బంధుత్వము నాలోచింపక ప్రజాహితముకొరకు కంసుని వధించుటకు నిశ్చయించెను. కంసుని మరణానంతరమే మధురావాసులకు సకలసుఖముల ననుభవించు అవకాశము లభించినది. శ్రీకృష్ణుని రెండవపని జరాసంధుని దురాగతములను అరికట్టుట. కంసుని వధతో ఆర్యావర్తములో యిక ఎంతో కాలము వరకు అత్యాచారములు, అనాచారములు, స్వేచ్ఛాచారములు కొనసాగవని, ఏలయనగ శ్రీకృష్ణుని రూపములో నుద్భవించిన ఒక మహత్తర శక్తి సదాచారము, ధార్మికత, మర్యాదాపాలన, ప్రజాహితములకు మహత్త్వము నిచ్చునని జరాసంధుడు తలంపసాగెను. జరాసంధుని అల్లుడైన కంసుడు కూడ తనమామగారి రాజనీతినే అనుసరించుచుండెను.

కంసుని వధతో జరాసంధుడు తన కుటిల రాజనీతి, కుట్రల పరాజయముగ నెంచెను. వెంటనే జరాసంధుడు మధురపై నొకసారిగాక 17 సార్లు దండెత్తి దురాక్రమణ గావించెను. అపూర్వమైన యుద్ధచాతుర్యము గలిగిన కృష్ణుని నేతృత్వములో యాదవులు జరాసంధుని సైన్యమును మట్టికరిపించిరి. కాని శూరసేన ప్రదేశము దురాక్రమణ నెదుర్కొనుటకు తగిన సురక్షిత స్థలముకాదని యెంచి ద్వారకానగరము యాదవులకు తగిన స్థలముగనెంచి దానిని యాదవరాజ్య రాజధానిగజేసెను. జరాసంధుని సేనాధిపతియైన శిశుపాలుడు ప్రథమముగ

రుక్మిణీ వివాహసమయమున, రెండవసారి యుధిష్ఠిరుడు రాజసూయ యాగమును చేయుచు శ్రీకృష్ణునకు ప్రథమ అర్ఘ్యమునిచ్చి సత్కరించు సమయమున వివాదమును లేపి యజ్ఞమును ధ్వంసముచేసి శ్రీకృష్ణుడు తలపెట్టిన ధర్మరాజ్య సంస్థాపనా కార్యమున కడ్డుతగిలెను. ఆ సమయముననే శ్రీకృష్ణుడు శిశుపాలుని వధించి 'వినాశాయచ దుష్కృతాం' అనిన తన మాటకనుగుణముగ దుష్టుల నాశనమొనర్చు మహాయజ్ఞములో మరొక ఆహుతి నర్పించెను. దీనికి పూర్వమే జరాసంధుని అంతమొందించు అవకాశమేర్పడినది. అభాగ్యులైన 86 మంది రాజులను ఖైదీగావించి 100 మందియైన తరువాత వారందరినీ వధింపవలయునని తలంచినట్టి జరాసంధునివంటి రాక్షస ప్రవృత్తిగలవానిని సహించి విడిచిపెట్టుట శ్రీకృష్ణునివంటి ధర్మాత్మున కసంభవమైనది. అత్యాచారములు చరమదశకు చేరగనే శ్రీకృష్ణుని నీతి, భీముని బలముకలసి జరాసంధుని అంతమొందించినవి. యుద్ధముగాని, రక్తపాతముగాని జరుగలేదు.

మహాభారత యుద్ధములో భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, శల్యుడు, దుర్యోధనుడు మున్నగు కౌరవ మహారథులందరూ ఒక్కొక్కరుగ వధింపబడి యుధిష్ఠిరుడు తలపెట్టిన ధర్మరాజ్య రూప మహాయజ్ఞమునకు పూర్ణాహుతియైనది. ఈ మహత్ కార్యములో శ్రీకృష్ణునికృతి అందరికంటె మించినది. శ్రీకృష్ణుని యొక్క ఈ అపూర్వ రాజనీతి, యుద్ధకౌశల్యము, వ్యవహారదక్షతలు తెలియనివారాయనపై యుద్ధోన్మాదియను ఆరోపణ చేయుట, దేశమునంతనూ భయంకర యుద్ధజ్వాలలో త్రోసి స్వయముగ తాను తమాషా చూచువానినిగ వర్ణించుట సర్వదా అనుచితము. శ్రీకృష్ణుడు తనశక్తియుక్తుల నుపయోగించి యుద్ధమునాపుటకై ప్రయత్నించుట మనకు మహాభారతములోని పూర్వ ప్రసంగములో తెలియును. దేశపరిస్థితులను పరిష్కరించుటకు యుద్ధము నొక ఉపాయముగ అయనంగీకరింపకపోవుటేగాక యుద్ధము చేయుటకు ఎవరిని ప్రోత్సహింపలేదు. వ్యక్తిగత మానావమానములను లెక్కచేయక స్వయముగ ఆయన పాండవుల పక్షమున నుండి సంధికుదుర్చుటకై హస్తినాపురమునకెళ్ళిరి. వారి ఈ ప్రయత్నము సఫలముకాకున్నను మహాత్మా శ్రీకృష్ణుడు శాంతిస్థాపనకొరకెంత ఉత్సాహము చూపెనో, యుద్ధము జరుగుటనెంతగ విరోధించెనో, ప్రపంచమునకంత తెలిసినదే. భయంకర యుద్ధమునుండి ఈ భూగోళమును రక్షించుటను నాకు చూడవలయునని యున్నదని స్వయముగ ఆయన అనెను.

దుర్యోధనుడు సహజమైన తన దుష్టస్వభావముచేతను, క్రూర స్వభావముచేతను శ్రీకృష్ణుని మాటలను పెడచెవినిబెట్టెను. తత్ఫలితముగ యుద్ధమనివార్య మైనది. కాని ప్రజలు పాండవుల పక్షమున సత్యము, న్యాయము,ధర్మములు గలవనియు, కౌరవుల పక్షమున అసత్యము, అన్యాయము అధర్మములున్నవనియు తలంచు చుండిరి. ప్రపంచప్రజలకు సత్యన్యాయములగూర్చి వాస్తవికజ్ఞానము కలిగించుట లోనే శ్రీకృష్ణుని అపూర్వ దూరదృష్టి, మేధాశక్తి వ్యక్తమగును. యుద్ధము జరుగుట నిశ్చితమైనపుడు శ్రీకృష్ణుని అభిప్రాయము కూడా తదనుగుణముగ మారినది. అత్యాచారముల నరికట్టుటకు, దుష్టులను దండించుటకు, క్షత్రియులచే చేయబడు యుద్ధము క్షత్రియులకు స్వర్గమునకు తెరచియుంచిన మార్గముగ వర్ణించి, ఆతతాయిలను చంపుట ధర్మమని అర్జునునకు బోధించెను. రణరంగమున ప్రవేశించిన అర్జునుని ఆవరించిన క్లైబ్యము - నపుంసకత్వమును అనార్యజుష్టం, అస్వర్గ్యం, అకీర్తికరములుగ చెప్పుచు అతని నావరించిన జ్వరమునుండి విడిపించి యుద్ధము చేయుటకు ప్రేరేపించెను. వాస్తవముగ ఇదే క్షాత్రధర్మముయొక్క యథార్థ స్వరూపము. దీనిని శ్రీకృష్ణుడు తన సహజ ధోరణిలో అర్జునుకుపదేశించెను. సుమారు 5 వేల సం॥రలు గడచినను శ్రీకృష్ణుని అనాటి ఉత్తేజపూర్వక ఉపదేశము నేటికిని ప్రజల మనస్సులో నిరాశా నిస్పృహ, దుర్బలతలను దూరమొనర్చి కర్తవ్యపాలనకై ప్రేరణనిచ్చుచున్నది.

శ్రీకృష్ణుడు తన జీవితములో ననేక జాతీయ, అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించుటకు ప్రయత్నించెను. అదే సమయములో అయన సామాజికపరమైన సమస్యలను నిర్లక్ష్యము గావింపలేదు. శ్రీకృష్ణుడు వర్ణాశ్రమ ధర్మమును గట్టిగ సమర్థించుటే గాక శాస్త్రీయ గౌరవములను సమర్థించుచుండెడివారు. ఆయన స్వయముగ ప్రవచించిన గీతలో వర్ణాశ్రమ ధర్మమును విధించుచు గుణకర్మల ఆధారముగ వర్ణవ్యవస్థను ప్రవచించెను. శాస్త్రవిధిని విడిచి తనయిష్ట ప్రకారము స్వేచ్ఛగా వ్యవహరించువానికి సిద్ధిలభింపక పరలోకమున (అనగా రాబోవు జన్మలో) ఉత్తమగతి కూడ ప్రాప్తింపదని ఆయన అభిప్రాయము. అట్లనిన ఆయన సామాజిక సంకీర్ణతను గాని, కురీతులనుగాని పోషించెనని భావముకాదు. పరంపరగా వచ్చుచున్న రూఢివాదముల కాయన ప్రబలవిరోధి. ఆయనకుగల సమాజపరమైన ఆలోచనలు ఉదారతతోనూ, నీతితోనూ కూడుకొని యున్నవి. ఆయన నిరంతరము దళిత, పీడిత, శ్రామిక వర్గమునకు సహాయపడుచుండిరి. విదురునివంటి ధర్మాత్మునిచే

ఆయన గౌరవము నొందుటకు పాత్రుడయ్యెను. నారీజనుల(స్త్రీల) పై ఆయనకు గొప్ప గౌరవముండెను. కుంతి, గాంధారి, దేవకి మున్నగు పూజనీయ, అభిమాన పాత్రురాళ్ళైన మహిళలయెడల ఆయన హృదయములో నెల్లవేళల ఆదరము, సమ్మానము, శ్రద్ధాభావములుండెను. సుభద్ర, ద్రౌపదిలవంటి పిన్నవయస్కులైన దేవీలయెడల సదా స్నేహభావముండెడిది. మాతృదేవతకు యథోచితముగ సత్కారము జరుగుచున్నపుడే భావిసంతానములో మంచి సంస్కారము లేర్పడునని వారికి తెలియును.

శ్రీకృష్ణుని వ్యక్తిత్వమును సమీక్షించిన పిదప ఆయన జీవిత చరిత్రలోగల గొప్ప ఉదాత్తగుణములను ధ్యానమునందుంచుకొనుట కూడ అవసరము. ఈ గుణములే ఆయనను ఆధ్యాత్మిక రంగమున సర్వోత్కృష్ట ఉపదేశకునిగ (ప్రవక్తగ) గణింపబడి యోగేశ్వరులలో ఒకనిగ లెక్కించుటకు కారణభూతములైనవి. నేటికి కూడ ఆయన కోట్లకొలది జనులకు శ్రద్ధ మరియు నిష్ఠలతోకూడిన ప్రేరణనిచ్చువారైరి. శ్రీకృష్ణుడు రాజనీతిజ్ఞుడు, ధర్మోపదేశకుడేగాక ధర్మసంస్థాపకుడు కూడా. ఆయన సమాజ సుధారకుడు. మరియు నవీన క్రాంతికి కారకుడుకూడా. యోగి మరియు ఆధ్యాత్మి జీవనలక్ష్యసాధకుడు. నీటిలోని కమలము నీటినంటకుండునట్లే ప్రపంచమున నుండియు సాంసారిక వాసనలకు లొంగక నిర్లిప్తునిగ యుండి ఫలాపేక్ష రహితముగ కర్తవ్యకర్మల నాచరించుచుండుటయే యోగసాధన కత్యంత ఆవశ్యకమని ఆయన బోధించెను.

శ్రీకృష్ణుడు జ్ఞాన, కర్మల రెండింటి సమన్వయమును సమర్థించు చుండెడివారు. దానితోపాటు ఉపాసనాయోగమును కూడ సమర్థించుచుండెను. జ్ఞాన, కర్మ, ఉపాసనల మూడింటి సమదృష్టియే ఆర్యత్వములోని విశేషత. ఈ సమన్వయ భావనయే శ్రీకృష్ణుని వ్యక్తిత్వమున ఉజ్జ్వల రూపమును దాల్చినది. శ్రీకృష్ణుడు స్వయముగ సచ్చిదానందుడైన పరమేశ్వరుని ఉపాసకుడు. ఆ పరతత్త్వమును సాక్షత్కారమొనరించుకొనిన పిదపకూడా లౌకిక మార్గమును వీడుట అనుచితముగ ఆయన భావించెడివారు. కోరికలు నెరవేరిన వ్యక్తి చేయవలసిన కర్మలేవియు లేకున్నను లౌకిక జీవితమును గడుపుటకొరకు ఆర్యోచిత మర్యాదలను పాటింపవలయునని 'గీత'లో ఆయన స్పష్టముగావించెను. ఈ విధముగ కాలాంతరమున ప్రబలిన ప్రమాణవాదముచే ప్రతిపాదింపబడిన నివృత్తి మార్గము నేకాంతముగ ననుసరించుట అనుచితమని తెలిపెను. శ్రీకృష్ణుని దృష్టిలో ఇదే

చివరితత్త్వము. ఇదే లౌకిక సఫలతకు రహస్యముకూడ.

జీవితములో ఎదురగు అనేక రకముల సర్వాంగ సమన్విత క్లిష్ట విషయములను సమన్వయమొనర్చి వాటిని చతురతతో పరిష్కరించుటయే శ్రీకృష్ణుని చరిత్రలోని విశేషము.

## శ్రీకృష్ణుని అవసరము నేడున్నది

శ్రీకృష్ణుని కాలమున భారతదేశములో రాక్షసశక్తులు చెలరేగినవి. కంసుడు, జరాసంధుడు, శిశుపాలుడు, భౌమాసురుడు మరియు కౌరవాది దుష్టరాజులు రాజ్యమేలుచుండిరి. 'యథారాజా తథాప్రజా' అను లోకోక్తి ననుసరించి ప్రజల సహకార సమర్థనలతో (అండదండలతో) ఈ రాక్షస రాజ్యపాలన జరుగుచుండెడిది. అందువలననే ఆ రాజ్యప్రజలు కూడ తమ రాజులొనర్చిన పాపములకు భాధ్యులై ఆ పాపకృత్యములకు ఫలముల ననుభవింపవలసి వచ్చినది. కౌరవులు మహాపాపులైతే పాండవులు కూడా పాపులే. కాని పరిమాణములో భేదము. పాండవు లెవరికిని అన్యాయము చేయుటగాని ఎవరి అధికారమును దత్తము చేసుకొనుటగాని చేయలేదు.

తమ హితమునుగోరు బంధు బాంధవులందరూ వద్దని వారించినను వినక యుధిష్ఠిరుడు జూదమునాడి తమ సర్వస్వమును ఓడిపోవుటే గాక చివరకు తన భార్యనుకూడా ఒడ్డి ఓడిపోయెను. ఏదైనా వస్తువును వేలమువేయువాడు వేలము పాటపాడువారి నాకర్షించుటకొరకు తన వస్తువునెట్లు ప్రశంసించునో యట్లే కౌరవుల నాకర్షించుటకొరకు యుధిష్ఠిరుడు ద్రౌపదిని పొగడుట, సభాపర్వములోని 65వ అధ్యాయమునందలి 36-39 శ్లోకములను చూచిన తెలియును. ధర్మమునుగూర్చి ఉపదేశముచేయు యుధిష్ఠిరుడు అప్పుడు మత్తులో పడియుండెనా!? అతడేమిచేయుచున్నాడో తెలియని స్థితియది. దుశ్శాసనుడు ద్రౌపదిని జుట్టుపట్టుకొని సభకు ఈడ్చుకొని వచ్చుట, ఆమెను వేశ్యయని మాటిమాటికి అవమానమొనర్చుట, వివస్త్రను చేయుటకు యత్నించుచున్న సమయమున కూడా ఒక నపుంసకునివలె తలవంచుకొని ఒక పతివ్రతయైన సతికి జరుగుచున్న ఘోర అవమానమును చూచుచు ఊరుకుండుటను మించిన మహాపాపము మరొకటి యుండునా ? ఒక్క సీత నవమానమొనర్చిన కారణముగ రాక్షస వంశమునంతనూ శ్రీరాముడు నాశనమొనర్చెను, కాని పాండువుల తమ వంశనాశనమునకే కారణమైరి. జూదమాడి ద్రౌపదిని ఓడిపోవుట తన తప్పుగ యుధిష్ఠిరుడెన్నడు తలంపలేదు. తానెప్పుడు

ధర్మాత్ముడుగనే వ్యవహరింపబడుచుండెను. యుద్ధములో చివరకు ఒక్క దుర్యోధనుడే మిగిలియున్నప్పుడతనిని యుద్ధముచేయట కంగీకరింపజేయుటకై యుధిష్ఠిరుడు తిరిగి జూదమాడెను. మా ఐదుగురు సోదరులలో ఏ ఒక్కరితోనైనా యుద్ధము చేసి ఓడించినచో ఈ కౌరవరాజ్యమును నీకిచ్చివేయుదుననెను. ఇది శకునితో నాడిన జూదముకంటే మిక్కిలి భయంకరమైనది. ఏలయనగా న్యాయముగ చేసిన గదా యుద్ధములో దుర్యోధనుని ఓడింపగలవారు పాండవులలో లేరు. చేతికందిన రాజ్యము జారిపోవుచున్నది. ఈ స్థితిని జూచిన కృష్ణుడు కూడ చివరకు విసుగుచెంది 'పాండురాజు - కుంతీదేవిసంతానము రాజ్యసుఖముల ననుభవించుట కధికారులు కారని, సృష్టికర్త వారిని జీవితాంతము వనవాసము చేయుటకు గాని, బిచ్చమెత్తుకొనుటకు గాని పుట్టించెనని నిశ్చయముగ చెప్పుచున్నానను' వరకు స్థితి విషమించినది. చివరకు శ్రీకృష్ణుని రాజనీతిజ్ఞత, కుశలబుద్ధి కారణముగనే దుర్యోధనుడు యుద్ధములో పరాజయము నొందెను.

శ్రీకృష్ణుడు ఛల, కపట, మోసములను ప్రయోగించి పాండవులకు విజయమును చేకూర్చెనని సాధారణముగా చాలామంది ఆరోపణలు చేయుచుందురు. కాని ధర్మమునకు రెండు రూపములున్న వనుమాటను వారు మరచుచుందురు. ఒకటి శాశ్వత ధర్మము. రెండనది వ్యావహారిక ధర్మము. (దీనిలో ఆపద్ధర్మము, యుద్ధధర్మము రెండు కూడియున్నవి.) ఈ రెండు ధర్మములు వేర్వేరగుట వలన ఒకదానితో నొకటి సమానము కాజాలవు. అట్లు ప్రయోగించినచో యది యధర్మమగును. అశుభకారి యగును. జీవితమంతా అధర్మపక్షమునే సమర్థించుచు ధర్మపక్షమున కహితమొనర్చు వానినెట్లయినను హతమొనర్చుటే ధర్మము. అదియే శాశ్వత ధర్మము. భీమునకు విషమునిచ్చిన వారికి, పాండవులందరినీ కుంతితో సహా లక్కఇంట పెట్టి సజీవ దహనమొనర్చుటకు ప్రయత్నించినవారికి భీష్ముడేమి దండన నిచ్చెను.?

ఒక పతివ్రతను సభలో నందరి ఎదుట నగ్నమొనర్చుటకు ప్రయత్న మొనర్చిన కర్ణదుర్యోధనులను నిరోధింపక, బలవంతుడేదిచేసిన అదే ధర్మమని సమర్థించిన భీష్ముడా ధర్మాత్ముడు? అందువలననే కృష్ణుడు శాశ్వత ధర్మానుసారము భీష్ముని వధింపచేసెను. ఒక వ్యక్తితో నొకేవ్యక్తి పోరాడవలయునను యుద్ధనియమ మేదియును లేదు. మహాభారత యుద్ధములో నే వంశమువారును ఈ నియమమును పాలింపలేదు. అర్జునుడు భీష్మునిపై శరవర్షమును కురిపించుచున్నప్పుడు భీష్ముడు

కూడా అర్జునునిపై బాణముల వర్షమును కురిపింపవలసినది. శత్రువు యొక్క తప్పులను లేక దుర్బలతలనుండి లాభమునొందుట ప్రతి వీరుని కర్తవ్యము. సత్యమును చెప్పుచు నాచరించువారికే సత్యధర్మము వర్తించును. కాని అధర్మాచరణ నొనర్చువారికి కాదు. కనుక శ్రీకృష్ణుని నిందించుట తప్పు. నెయ్యివంటి పలుచని వస్తువునుకూడా నిలువుగనుంచిన వ్రేలుతో తీయజాలము. వ్రేలును వంచుట అవసరము. విషమును హరించుటకు విషప్రయోగమునే చేయవలయును. దుష్టులతో సద్వ్యవహారము హానినే కలిగించును.

కౌరవ పాండవులు జూదమాడుచున్నప్పుడు, ద్రౌపదిని నగ్న మొనర్చుటకు ప్రయత్నించు సమయములో ద్రోణాచార్యుడు సభలో నున్నను కేవలము మూగవానివలె నుండి చూచుచుండెను. అభిమన్యుడు పద్మవ్యూహమును ఛేదించి, గొప్పగొప్ప మహారథులను పరాజయమొనర్చి కౌరవ సేనలను భయభ్రాంతుల నొనర్చినపు డతనిని చుట్టుముట్టి శస్త్రరహితునిగ చేసి చంపుటకు ద్రోణాచార్యుని సలహాపై కర్ణుడు వెనుకనుండి అభిమన్యుని ధనుస్సును విరచి అతనిని శస్త్రరహితుని చేసెను. తరువాత గాయపడి మూర్ఛితుడైయున్న అభిమన్యుని వధించుటకు ద్రోణాచార్యుడు ముఖ్యపాత్రను వహించెను. అట్లే ద్రోణాచార్యుడు యుధిష్ఠిరుని ప్రాణములతో బంధించి తెచ్చుటకును, సంపూర్ణముగ పాండవ సైన్యమును సంహరించుటకును ప్రతిజ్ఞచేసెను. తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనుటకై మానవతకు తిలోదకములిచ్చి అమాయకులైన సైనికులపై దివ్యాస్త్రములను ప్రయోగించి వారిని వధించుటారంభించెను.

ఈ క్రూర పతిత బ్రాహ్మణుడు సాయంసమయమునకు పూర్వమే పాండవ సైన్యము నంతనూ వధించి కౌరవులకు విజయమును చేకూర్చునని శ్రీకృష్ణుడు ముందుగనే గ్రహించి ఒక ఉపాయము నాలోచించెను. అశ్వత్థామ మరణించినట్లుగ ద్రోణాచార్యునకు అబద్ధము చెప్పించి యతనిని విచలితునిచేసి సమయముచూచి ధృష్టద్యుమ్నునితో నతని శిరస్సును ఖండింపజేసెను. తన సైన్యమును రక్షించుకొనుటలో శ్రీకృష్ణుడు చేసిన చెడుకార్యమేమి? బ్రహ్మాస్త్రములు, దివ్యాస్త్రములను గూర్చి తెలియని సైనికులపై వాటిని ప్రయోగించుట నిజముగనే ఘోరపాపము. ఆ బ్రహ్మాస్త్రము అర్జునునిపై, ప్రయోగించినచో తప్పులేదు. అతడు దానికి సరియైన సమాధానమివ్వగలడు.

ద్రోణాచార్యుడే గనుక జీవించియుండి అశ్వత్థామ బ్రతికియుండుట

చూచినచో ఆ క్రూర తండ్రీకుమారు లిరువురును కలిసి పాండవసైన్యమునంతనూ సంహరించిన పిదప ఊపిరి పీల్చుకొని యుండెడివారు. యుద్ధములో చివరిరోజు రాత్రి అశ్వత్థామ నిద్రించుచున్న పాండవసేనలోని వీరులను అతిక్రూరముగ చంపిన పద్ధతి ప్రపంచచరిత్రలో ఎచ్చటను దృష్టాంతము దొరకదు. చివరకు పాపాత్ముడైన తన యజమాని మరణించిన పిదపకూడ అతడు పాండవులను సమూలముగ నాశనమొనర్చుటకై బ్రహ్మాస్త్రమును కూడా ప్రయోగించి చివరకు ఉత్తర గర్భమున నున్న శిశువును మృతప్రాయునిగ చేసెను. శ్రీకృష్ణుడా బాలుని ఏదోవిధముగ రక్షింపకపోయినచో పాండవవంశజుడెవడును ఈ లోకమున నుండెడివాడుకాడు. గదాయుద్ధమున భీమునిచే దుర్యోధనుని తొడలను విరుగగొట్టించి చంపునపుడు, కర్ణుని రథచక్రము భూమిలో క్రుంగిపోయినపుడు అర్జునునిచే కర్ణుని చంపించునపుడు శ్రీకృష్ణుడు శాశ్వత ధర్మమునే పాలించెను. మహాభారత యుద్ధమునకు కర్ణుడే దుష్టనాయకుడు. అతని ప్రేరణ, సలహాలతోనే దుర్యోధనుడు పాండవులతో శత్రుత్వమును వహించెను. అతని ప్రేరణతోనే ద్రౌపదిని వివస్త్రను చేయుటకు యత్నించెను.

కర్ణుడే గనుక దుర్యోధనుని పక్షమున నుండకపోయినచో సర్వనాశనకరమైన మహాభారత యుద్ధము జరిగియుండెడిదికాదు. ఏమైనప్పటికిని పతితులై దుష్టులైన బ్రాహ్మణ క్షత్రియాదులను వధింపచేసి శ్రీకృష్ణుడు లోకకల్యాణమును, పుణ్యకార్యమునే చేసెను.

కౌరవులతో యుద్ధమునకు అన్నిటికంటె ముఖ్యకారణము ఛలకపటములతో జూదమాడుట. తరువాత ఆ జూదములోని షరతులను వారు పాటింపకుండుట. శ్రీకృష్ణుడు పాండవులను అరణ్యములో కలుసుకొని కౌరవులను చంపుటకు తన సహాయమును ప్రకటింపగా వారందుల కంగీకరింపలేదు. ఘోషయాత్రా సమయమున చిత్రసేనుడను గంధర్వునితో యుద్ధముజరుపగా ఆ యుద్ధములో చిత్రసేన గంధర్వుడు దుర్యోధనాది కౌరవులను స్త్రీలతోసహా బంధింతులను గావించినపుడు భీమార్జునుల కిష్టములేకున్నను గంధర్వుని ఖైదునుండి విడిపించుటకై చిత్రసేనునితో యుద్ధము చేయుటకు ధర్మరాజు అర్జునుని పంపెను. యుధిష్ఠిరునకు సత్యధర్మము గూర్చి తెలియదు. బంధుబాంధవులెవరు? శత్రువులెవరను జ్ఞానముకూడా అతనికి సరిగాలేదు. జన్మజాత శత్రువునుకూడా అతడు బాంధవుడనుకొనుచుండెను. ఒకే కుటుంబమున జన్మించినంత మాత్రముననే బంధువగునా? ఏదైనా ఒక ఇంటిలో

ఒక పాము జన్మించిన ఆ యింటిలోని వారందరికి బంధువుకాక శత్రువేయగును. సమయముచూచి అప్పుడప్పుడది బుసలుకొట్టుచుండును. బంధువు ఆపదలో సహాయముచేయును. దుర్యోధనాదులను చిత్రసేనుని ఖైదులోనేయుంచి, యుధిష్ఠిరుడు తానే రాజ్యాధికారమును చేపట్టియుండవలసినది. కాని యుధిష్ఠిరుని ధర్మవ్యాఖ్యానమే తప్పు. ఆ సమయమున శ్రీకృష్ణుడున్నను యుధిష్ఠిరుడాయన సలహానంగీకరింపడు. మూర్ఖతకుకూడా హద్దుయుండవలయునుగదా!

## శ్రీకృష్ణుని జన్మదినోత్సవమెందుకు జరుపుకొందుము

మహాభారత కాలమున భీష్మ పితామహుడు అందరిచే గౌరవింపబడినాడు. జీవితాంతము బ్రహ్మచర్యవ్రతమును పాలించి అమరుడయ్యెను. యుద్ధ నైపుణ్యములో నద్వితీయుడు. శాంతిపర్వములోని యతని ఉపదేశములు అతని బుద్ధితీవ్రతకు ప్రమాణములు. ఐనా అంతటి మేధావి జన్మదినోత్సవమును మనము జరుపుకొనుట లేదెందులకు? ఆయన బ్రహ్మచర్య వ్రతపాలనము విశేష పరిస్థితుల ప్రభావము వలన జరిగినది. కాని వాస్తవముగ దానికి స్వయంస్ఫూర్తి గాని లేక (కొండొక) ఏదైనా లక్ష్యము, ప్రయోజనముగానిలేదు. కాముకుడైన తన తండ్రికోర్కె తీర్చుటలో సహాయపడుటయే యతని ఏకైక లక్ష్యము. యుద్ధములో నతడు అపరాజితుడు. ఐనా అతడెవరికొరకు యుద్ధము చేసెను? కౌరవుల పక్షము అన్యాయమైనదైనప్పటికిని వారి పక్షమున నుండియే యన్యాయమును రక్షించుటకు పోరాడెను! దానికి కారణమాయన నడిగినప్పుడు "అర్థస్య పురుషోదాసః" అని చెప్పితన అసహాయతకు కారణముతెల్పి మౌనమువహించెను. నిండుసభలో ద్రౌపది కవమానము జరుగుచున్నప్పుడు మాట్లాడక ఆదృశ్యమును చూచుచున్న యతనిని, వంశమునకు పెద్దవానినిగగాని, బ్రహ్మచర్య తేజస్సుగల వానినిగ గాని, భుజబలముగల వానినిగగాని, ధర్మాధర్మ కర్తవ్యాకర్తవ్యజ్ఞానముగల వానినిగగాని కల్పనకూడ చేయలేము. అట్టి వ్యక్తి జన్మదినోత్సవము నెవరు జరుపుకొందురు? ఆకాలముననే మరొక మహాపురుషుడు వేదవ్యాసుడుండెను. ఆయన రచించిన గీతోపదేశము ముందు ప్రపంచమంతయు మోకరిల్లును. కాని యది మహాభారతములోని యొక భాగము మాత్రమే. సంపూర్ణ మహాభారతమును, వేదాంత దర్శనమును రచించినట్టి వేదవ్యాసుని బుద్ధిబలమునెవరు అంచనావేయగలరు? కాని ఆయన మాటలను వినువారెవరు? "ఊర్ధ్వబాహుః విరౌమ్యేషనహికశ్చిత్ శృణోతిమాం" అను వ్యాసుని ఈ శబ్దములలో యెంతో ఆవేదన కలదు. వ్యాసుడంతా శ్రేయస్సునే వుపదేశించెను.

మంచినే చేసెను. కాని నేడు దానిని గర్వముగ చెప్పుకొనువారెవరున్నారు? నేటి సమాజముపేక్షించినట్టి వ్యక్తి జన్మదినోత్సవము నెవరు జరుపుకుందురు?

యుధిష్ఠిరుడు - ధర్మరాజు :

ఇతడు తన జీవితములోనెప్పుడు అసత్యమును చెప్పలేదు. ఐనా ఒకసారి పరిస్థితుల ప్రభావముచే నేదో యనినందుకు (పలికినందున) శిక్షననుభవింపవలసి వచ్చెను. అతడు మానాపమానములను మరచి యెల్లప్పుడు రాజీపడుటకు సిద్ధముగా నుండెడివాడు. అటువంటి ధర్మపుత్రునిలో జూదమాడు దోషమొకటి యతనిని విడువకుండెడిది. ఆ కారణముగ అతనే గాక అతని పరివారమంతా సంవత్సరముల తరబడి అరణ్యములలో నుండవలసివచ్చెను. తన పత్నినికూడ జూదములో నొడ్డిన ధర్మపుత్రుని జన్మదినమును ఏ సభ్యమానవుడు జరుపుకొనును?

వీరందరూ క్షత్రియులు. వీరితోబాటు ఒక బ్రాహ్మణుడు - ద్రోణాచార్యుడుండెను. సామాజిక వ్యవస్థలో బ్రాహ్మణున కత్యున్నత స్థానమున్నది. బ్రాహ్మణుడైన గురువువద్దకు విద్యార్థులు విద్యనభ్యసించుటకై వెళ్ళుచుండెడివారు. కాని గురువులు విద్యార్థుల యిండ్లకు వెళ్ళి చదువుచెప్పుచుండెడివారు కారు. రాజాశ్రయముపొంది ట్యూటర్ పద్ధతిన శిష్యులయింటి వద్దనుండి విద్యనేర్పుటారంభించిన వ్యక్తులలో ద్రోణాచార్యుడు మొట్టమొదటివాడు. నేటి యుపాధ్యాయులవలె శిష్యులపై పక్షపాతముతో వ్యవహరించు బుద్ధివారిలో కనబడును. ఏకలవ్యుని విషయమందరికి తెలిసినదే. ఈ విధముగ ద్రోణాచార్యులు బ్రాహ్మణోచిత ధర్మమును నుల్లంఘించుటే గాక గౌరవప్రదమైన గురుపదమును కూడ కళంకితమొనర్చెను. అందువలన భీష్మునివలెనే వారుకూడ దుర్యోధనాదులు జరుపుచున్న అన్యాయములన్నింటికిని ఉదాసీనవైఖరి నవలంభించెను. ఇంతేకాక సమయము వచ్చినపుడు అన్యాయమును రక్షించుటకు ప్రయత్నించెను. అట్టి పరిస్థితులలో " పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం" అను ఆర్యోక్తి ననుసరించి కృతసంకల్పుడై భుజబలము మరియు బుద్ధిబలము రెండింటిలో సమర్థుడైనట్టి వ్యక్తి కృష్ణుని రూపములో ఆవిర్భవించెను. ఎవరి తల్లితండ్రులు తమ జన్మకుపూర్వమే కారాగార శిక్షననుభవించుచుండిరో, అట్టివారు క్రాంతికారులుగ నేల జన్మింపకుందురు? అందువలననే కృష్ణుడెక్కడ పాపములు పెరుగుచున్నవో వినినంతనే వానినణచుటకై యక్కడకు పరుగిడుచుండెడివారు. ఒక్కొక్కరు చొప్పున అనేకమంది అత్యాచారులను సంహరించి చివరకు కురుక్షేత్ర యుద్ధములో 'సర్వం వైపూర్ణగ్ం స్వాహా' చేసి సంపూర్ణదేశము

నౌకేత్రాటిపై బంధించి శాంతిని స్థాపించెను. 1857 సం॥లో భారత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సందర్భమున శ్రీకృష్ణుని సామర్థ్యమును స్మరించుచు మహర్షి దయానందుల వారిట్లు వ్రాసిరి. 'శ్రీకృష్ణునివంటి వారెవరైనా ఈ సమయములో నున్నచో ఆంగ్లేయులను పారద్రోలి యుండెడివారు.'

స్వమంతవ్యా మంతవ్య ప్రకాశమున మహర్షి దయానందుల వారిట్లు వ్రాసిరి. 'మనశీలుడై తనవలె యితరుల సుఖదుఃఖములను, హాని లాభములను తెలుసుకొనువానినే మనుష్యుడని పిలుతురు. అన్యాయకారి యైన బలవంతునకు కూడ భయపడరాదు. కాని ధర్మాత్ముడైన బలహీనునకు భయపడవలయును. అంతేగాక మన సర్వశక్తిని వినియోగించి అనాథలు, నిర్బలులైనప్పటికిని ధర్మాత్ముల యొక్క రక్షణ ఉన్నతి ప్రియాచరణము లెల్లప్పుడు చేయుచుండవలయును. అనగా వీలైనంతవరకు అన్యాయకారులను బలహీన పరచుచు, న్యాయకారులను సర్వదా బలపరచు చుండవలయును.'

**మహర్షిదయానందుని ద్వారా ప్రస్తుతింపబడిన ఈ మానవతయను గీటురాయి శ్రీకృష్ణునియందు సంపూర్ణముగా అన్వయించును. ఆయన జీవన పర్యంతము అన్యాయకారులతో సంఘర్షణ జరుపుచు న్యాయమును పరిరక్షించు చుండెడివారు. మనుష్యుడు స్వభావముతో స్వార్థపరుడు. తనకు సహాయపడినవారిని కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచుండును. శ్రీకృష్ణుని సమకాలీనులలో గొప్పగొప్ప వారు తమకొరకు జీవించి, మరణించిరి. శ్రీకృష్ణుడు ధర్మాత్ములైన యితరులకొరకు దీనులు దుఃఖితుల కొరకు పీడితజనుల కొరకు జీవించి వారికొరకే పోరాడుచు మరణించెను. అందువలన సమాజము, దేశము నేటికిని ఆయనను స్మరించుచు ఆయన జన్మదినోత్సవమును జరుపుకొనుచున్నారు.**

**యుగపురుషుడు శ్రీకృష్ణునకు - జై !!!**

# మా గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

12-10-586/6, వ్యాస నగర్, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 500 061

| పుస్తకము పేరు | రచయిత | వెల |
|---|---|---|
| 1. గోమాత | (డా॥ కేడూరి సుబ్బారావు) | 7.00 |
| 2. వైదిక వైజ్ఞానిక సంస్కృతి | ,, | 10.00 |
| 3. మానవ ధర్మము | ,, | 3.50 |
| 4. గాయత్రీ మహిమ | ,, | 6.00 |
| 5. వైదిక క్రాంతి పథం | ,, | 15.00 |
| 6. చతుర్దశ భువనములు | ,, | 3.00 |
| 7. అగ్ని హోత్ర వైజ్ఞానిక స్వరూపము | ,, | 15.00 |
| 8. యజ్ఞోపవీత వైశిష్ట్యము | ,, | 2.00 |
| 9. జననీ - జన్మభూమి | ,, | 5.00 |
| 10. ద్రౌపదివి (ఋషులదృష్టిలో గర్వితస్త్రీ) | ,, | 10.00 |
| 11. యుగపురుషుడు శ్రీకృష్ణుడు | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 8.00 |
| 12. పురుషోత్తముడు శ్రీరాముడు | ,, | 8.00 |
| 13. వైదిక వివాహ వైశిష్ట్యము | (సంధ్యావందనం లక్ష్మీదేవి) | 5.00 |
| 14. మాతా పుత్రికల జ్ఞాన చర్చ | (లోక మల్హరి) | 15.00 |
| 15. బ్రహ్మచర్య విజ్ఞానము | (కె. సూర్యనారాయణ) | 15.00 |
| 16. వైదిక అర్థనీతి | ,, | 2.00 |
| 17. దయానందుని ఆదర్శ రాజ్యము | ,, | 1.00 |
| 18. వైదిక సంధ్యాగ్ని హోత్ర విధి | | 1.50 |
| 19. దైవిక అగ్ని హోత్ర విధి | | 4.00 |
| 20. THE GREAT GAYATHRI | | 2.00 |
| 21. శాంతి ప్రార్థన | | 0.75 |
| 22. మహర్షి మనువుపై విరోధమెందుకు? | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 3.00 |
| 23. వేదాలలో విజ్ఞాన బీజాలు | ,, | 10.00 |
| 24. అక్కాచెల్లెండ్ల ధార్మిక చర్చ | లోకా మల్హరి | 20.00 |
| 25. ధర్మవీర్ పం. లేఖరాం | (సంధ్యావందనం శ్రీనివాసరావు) | 3.00 |
| 26. చాణక్యనీతి | (ఆ. వెంకయార్య) | 40.00 |

గమనిక: తపాలా ఖర్చులు అదనము. వి.పి.పి. పద్ధతిలో నగము పైకము ముందుగనే పంపవలెను.